# శ్రీ శరన్నవరాత్ర పూజా కల్పము

ఓం గం గణపతయే నమః । ఓం శ్రీ దుర్గాయై నమః

శ్లో॥ భూతాని దుర్గా! భువనాని దుర్గా! స్త్రీయో నరశ్చాపి పశుశ్చ దుర్గా!
యద్యద్ధి దృశ్యం ఖలు నైవ దుర్గా! దుర్గా స్వరూపాదపరం న కించిత్?॥

అంటే..సమస్త భూతములు, లోకములూ అన్నీ దుర్గా స్వరూపమే. స్త్రీలు, పురుషులు, పశువులు అన్నీ దుర్గాస్వరూపమే! అంతెందుకు? లోకంలో కంటికి కనిపించేవి, ఏవైతే మనం చూడగలుగుతున్నామో... అదంతా దుర్గా స్వరూపమే! కాబట్టి.. దుర్గా స్వరూపం కానిదంటూ ఏదీలేదు!

మన హిందూ సాంప్రదాయానుసారంగా శరదృతువులో మొదటి తొమ్మిది రోజులను మనం శరన్నవరాత్రులుగా పిలుచుకుంటూ, ఆ తొమ్మిది రోజులను, రోజుకొక దేవతగా భావించి, దుర్గాదేవిని అలంకరించుకుని మన శక్తి కొలదీ పూజిస్తూ ఉంటాము. అనేక ప్రాంతాలు, వివిధ ఆచారాలు, సాంప్రదాయాలు. అయినా, సమగ్ర సమాచారాన్ని సేకరించి, మన పాఠకులకు అందించడంలో అమితమైన సంతోషం కలుగుతోంది నాకు. ఈ శరన్నవరాత్రాలకు సంబంధించి, ఒక్కొక్కరోజు ఒక్కొక్క దేవతరూపంలో మనం దుర్గాదేవిని కొలిచి ప్రార్థన చేస్తాము. ఈ కారణంగా.. నేను గతంలో మీ అందరికీ అందుబాటులోకి తెచ్చిన 'సిద్ధి వినాయక వ్రత కల్పము' కు కొనసాగింపుగా, ఈ 'శ్రీ దుర్గా శరన్నవరాత్ర పూజా కల్పము' ద్వారా 'దుర్గా దేవి పూజా విధానము'ను కూడా 'నమస్కరోమి' పాఠకులకు 'తెలుగు భోజనం' ఫేస్‌బుక్ పేజీ వారి సౌజన్యంతో, శ్రీమతి నయనతార కస్తూరి సహకారంతో అందిస్తున్నాను. వీరికి నా ప్రత్యేక కృతజ్ఞతలు తెలియజేసుకుంటున్నాను.

ఈ విధంగా పాఠకులందరికీ 'శ్రీ దుర్గా శరన్నవరాత్ర పూజా కల్పము' అందుబాటులోకి తీసుకురావాలని సంకల్పించి మా మాతా పితరులయిన బ్రహ్మశ్రీ నేతి సూర్యనారాయణమూర్తి గారు, శ్రీమతి నేతి సీతా రామలక్ష్మి గార్ల ఆశీర్వాదముతో, నిర్విఘ్నముగా ఈ పుస్తక ముద్రణ బాధ్యతను పూర్తిచేశాను. నా ఈ సంకల్పానికి, శ్రీమతి నయనతార కస్తూరి, హైద్రాబాద్ వారి అమూల్యమైన సహకారంతోడై ఈ నవరాత్రములలో ప్రతీ రోజూ అమ్మవారి అలంకార విశేషాలు, ఆ దేవికి నివేదించవలసిన పదార్థాలు, అవి తయారు చేసే విధానం, ఈ వివరణ చివర్లో ఆయాదేవతల అష్టోత్తర శతనామావళి.. ఇలా వివరణ తో కూడిన ప్రత్యేక అనుబంధంగా...మరింత విపులంగా రావడానికి దోహదపడింది. ఈ ప్రయత్నాన్ని పాఠకులు హర్షిస్తారని ఆశిస్తున్నాను.

నా ఈ ప్రయత్నంలో...చిన్న చిన్న అక్షరదోషాలు కానీ, శబ్ద దోషాలుకాని పొరపాటున దొర్లిన పక్షంలో విజ్ఞులైన పాఠకులు మన్నించి తగు సూచనలు అందిస్తారని ఆశిస్తున్నాను. ఇలాగే దీపావళికి కూడా ఇలాగే 'లక్ష్మీ దేవి పూజా విధానము' కూడా 'నమస్కరోమి' తరపున మీఅందరికీ అందించాలని నా సంకల్పం. దానికి సంబంధించిన పని కొనసాగుతోంది. శరన్నవరాత్ర శుభాకాంక్షలతో...

– మీ ... నేతి వేంకట రమణ నాగేశ్వర శర్మ, విజయవాడ, వాట్సాప్ – 6303222312

## గణపతి పూజ

ముందుగా విభూతి, బొట్టు పెట్టుకుని, పూజకు కావలసిన పసుపు, కుంకుమ, గంధం, అక్షతలు, పత్తితో చేసిన యజ్ఞోపవీతం, పత్తితో చేసిన వస్త్రములు, కొబ్బరికాయలు, తమలపాకులు, వక్కలు, అరటిపళ్ళు, నువ్వులనూనె, వివిధ రకాల పుష్పములు, వివధ రకాల పత్రి (ఆకులు), అగరువత్తులు, సాంబ్రాణి, కర్పూరం, గంట, హారతి, నైవేద్యానికి ఏర్పాటు చేసిన ఉండ్రాళ్ళు మొదలయిన పూజా సామాగ్రి అన్నీ అందుబాటులో ఉంచుకుని పూజకు సిద్ధము కావాలి.

తరువాత 'ఓం గం గణపతయే నమః' అని మనసులో అనుకుంటూ, దీపారాధన కుందులను తమలపాకులమీద ఉంచి, దీపారాధన కోసం దీపపు కుందులలో నువ్వుల నూనెను వేసి, అందులో పత్తితో చేసిన రెండు వత్తులు వేసి, వెలిగించి మూడు వైపులా కుంకుమతో అలంకరించి, ఆ దీపమునకు నమస్కరించాలి.

( తర్వాత, ఈ క్రింది శ్లోకము చదువుతూ గణపతిని స్మరించుకోవాలి.)

శ్లో॥ శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్

ప్రసన్న వదనం ధ్యాయేత్ సర్వవిఘ్నోపశాంతయే॥

ఓం శ్రీ మహాగణాధిపతయేనమః (అని చెపుతూ గణపతికి నమస్కారము చేయవలెను.)

(ఈ క్రింది మంత్రమును చెపుతూ దీపమును వెలిగించవలెను)

శ్లో॥ భోదీప దేవి రూపస్త్వం కర్మసాక్షిహ్యవిఘ్నకృత్

యావత్ పూజాం కరిష్యామి తావత్వం సుస్థిరో భవ॥

### ఘంటానాదం

(పూజ చేయు స్థలమునకు దేవతలను లాంఛనంగా ఆహ్వానించుటకోసం

ఈ క్రింది శ్లోకమును చదువుతూ ఘంటను మ్రోగించాలి.)

శ్లో॥ ఆగమార్థంతు దేవానాం గమనార్థం తు రక్షసామ్ ।

కుర్యాద్ఘంటారవం తత్ర దేవతాహ్వానలాంఛనమ్ ॥

### శరీరశుద్ధి

శ్లో ॥ అపవిత్రః పవిత్రోవా సర్వావస్థాం గతోపివా ।

యః స్మరేత్ పుండరీకాక్షం స బాహ్యాభ్యంతర శ్శుచిః ॥

### ఆచమనమ్

(ఈ క్రింద చెప్పబడిన కేశవనామాలలో స్వాహా అని చెప్పబడిన మొదటి మూడు నామాలకు ఉద్ధరిణెతో నీటిని ఎడమ చేతితో తీసుకుని కుడి చేతిలోకి తీసుకుని నోట్లోకి తీసుకోవాలి. నాల్గవసారి చేతిలోకి నీరు తీసుకుని చేతులు కడుగుకొని నీరు పళ్ళెమునందు వదిలి మిగతా నామాలను నమస్కరిస్తూ ఉచ్చరించాలి.)

ఓం కేశవాయ స్వాహా, ఓం నారాయణాయ స్వాహా, ఓం మాధవాయ స్వాహా, ఓం గోవిందాయ నమః, ఓం విష్ణవే నమః, ఓం మధుసూదనాయ నమః, ఓం త్రివిక్రమాయ నమః, ఓం వామనాయ నమః, ఓం శ్రీధరాయ నమః, ఓం హృషీకేశాయ నమః, ఓం పద్మనాభాయ నమః, ఓం దామోదరాయ నమః, ఓం సంకర్షణాయ నమః, ఓం వాసుదేవాయ నమః, ఓం ప్రద్యుమ్నాయ నమః, ఓం అనిరుద్ధాయ నమః, ఓం పురుషోత్తమాయ నమః, ఓం అధోక్షజాయ నమః, ఓం నారసింహాయ నమః, ఓం అచ్యుతాయ నమః, ఓం జనార్ధనాయ నమః, ఓం ఉపేంద్రాయ నమః, ఓం హరయే నమః, ఓం శ్రీకృష్ణాయ నమః, ఓం శ్రీకృష్ణ పరబ్రహ్మణే నమః

## భూతోచ్చాటన

శ్లో॥ ఉత్తిష్ఠంతు! భూత పిశాచాః ! యేతే భూమి భారకాః !
యేతేషామవిరోధేన! బ్రహ్మకర్మ సమారభే!
(అని పై శ్లోకము చదువుకున్న తర్వాత తాను కూర్చున్న ప్రదేశమందు, అక్షతలను ఎడమ పక్కకు వదిలివేయాలి)

## ప్రాణాయామం

ఓమ్ భూః ఓమ్ భువః ఓగ్ం సువః ఓమ్ మహః ఓమ్ జనః ఓమ్ తపః ఓగ్ం సత్యం
ఓం తథ్సవితుర్వరేణ్యం భర్గో దేవస్య ధీమహి ధియోయోనః ప్రచోదయాత్ ॥
ఓమాపోజ్యోతీ రసోమ ృతం బ్రహ్మభూర్భువస్సువరోం ॥

## ధ్యానమ్

అయం ముహూర్తస్సుముహూర్తోస్తు
శ్లో॥ తదేవలగ్నం, సుదినం తదేవ, తారాబలం చంద్రబలం తదేవ।
విద్యాబలం, దైవబలం తదేవ, లక్ష్మీపతే తేంఘ్రియుగం స్మరామి ॥
శ్లో॥ లాభస్తేషాం జయస్తేషాం, కుతస్తేషాం పరాభవః ।
యేషామిందీవర శ్యామోహృదయస్థోజనార్దనః॥
శ్లో॥ ఆపదామపహర్తారం దాతారం సర్వసంపదాం।
లోకాభిరామం శ్రీరామం భూయోభూయో నమామ్యహం॥
శ్లో॥ సుముఖశ్చైక దంతశ్చ కపిలో గజకర్ణకః ।
లంబోదరశ్చ వికటో విఘ్నరాజో గణాధిపః ।
ధూమకేతుర్గణాధ్యక్షః ఫాలచంద్రో గజాననః ।
వక్రతుండ శ్శూర్పకర్ణో, హేరంబః స్కంధ పూర్వజః ॥

షోడశైతాని నామాని యః పఠేచ్ఛృణు యాదపి, విద్యారంభే వివాహేచ ప్రవేశే నిర్గమేతథా! సంగ్రామే సర్వకార్యేషు విఘ్నస్తస్యనజాయతే! అభీప్సితార్థ సిద్ధ్యర్థం, పూజితోయస్సురైరపి, సర్వవిఘ్నచ్ఛిదే తస్మై గణాధిపతయే నమః॥

## సంకల్పం

ఓం .... శుభే శోభన ముహూర్తే అద్యబ్రహ్మణః ద్వితీయపరార్ధే శ్వేతవరాహకల్పే, వైవస్వత మన్వంతరే, కలియుగే, ప్రథమపాదే, జంబూద్వీపే, భరతవర్షే, భరతఖండే, మేరోః, దక్షిణ దిగ్భాగే, శ్రీశైలస్య ఈశాన్య ప్రదేశే, కృష్ణా గోదావర్యోర్మధ్యదేశే, శోభన గృహే అస్మిన్ వర్తమాన వ్యావహారిక చాంద్రమానేన, స్వస్తిశ్రీ.......... నామ సంవత్సరే, ........అయనే (ఉత్తరాయణే, దక్షిణాయనే ) ..............ఋతే, ..............మాసే, ........... పక్షే (శుక్ల పక్షే, కృష్ణ పక్షే ) ...............తిథౌ, వాసరే (వారము పేరు), శుభనక్షత్రే, శుభయోగే, శుభకరణ ఏవంగుణ విశేషణ విశిష్టాయాం , శుభ తిథౌ, శ్రీమాన్ ............ గోత్రః ............నామధేయః , శ్రీమతః .....................గోత్రస్య,

.............నామధేయస్య, (వివాహం జరిగినట్లయితే ) ధర్మపత్నీ సమేతస్య, సహకుటుంబానాం, క్షేమ, స్థైర్య, ధైర్య, వీర్య, విజయ, అభయ, ఆయురారోగ్యఐశ్వర్యాభివృద్ధ్యర్థం, ధర్మార్థకామమోక్ష చతుర్విధ ఫల పురుషార్థ యోగ్యతాఫలసిద్ధ్యర్థం, ఇష్ట కామ్యార్థసిద్ధ్యర్థం, మనోవాంఛా ఫలసిద్ధ్యర్థం, సమస్త దురితోపశాంత్యర్థం, సమస్త మంగళావాప్త్యర్థం, వర్షే వర్షే ప్రయుక్త దుర్గా కల్పోక్త ప్రకారేణ శ్రీ మహాకాళీ శ్రీ మహాలక్ష్మీ శ్రీ మహా సరస్వతీ స్వరూపిణీ శ్రీ దుర్గాంబికా దేవతా ప్రీత్యర్థం, యావచ్ఛక్తి ధ్యానావాహనాది షోడశోపచార పూజాంకరిష్యే (ఉద్ధరిణెతో నీళ్ళు, కొంచం అక్షతలు తీసుకుని పళ్ళెములో వదిలి పెట్టాలి)

ఆదౌ నిర్విఘ్నేన పరిసమాప్త్యర్థం గణాధిపతి పూజాం కరిష్యే॥

## కలశారాధన

(తదంగ కలశారాధనం కరిష్యే అంటూ నీటిని వదిలిపెట్టవలెను)

శ్లో॥ కలశస్య ముఖే విష్ణుః కంఠేరుద్రస్సమాశ్రితః।
మూలే తత్ర స్థితో బ్రహ్మా మధ్యే మాతృగణా స్మృతాః।
కుక్షౌ తు సాగరాస్సర్వే సప్తద్వీపా వసుంధరా।
ఋగ్వేదోథ యజుర్వేదోసామవేదో హ్యథర్వణః।
అంగైశ్చ సహితాస్సర్వే కలశాంబుసమాశ్రితాః॥
శ్లో॥ గంగేచ యమునేచైవ గోదావరి సరస్వతీ।
నర్మదే సిధుకావేరీ జలేస్మిన్ సన్నిధింకురు॥
ఆయాంతు దేవపూజార్థం దురుతక్షయకారకాః॥

కలసోదకేన పూజా ద్రవ్యాణి సంప్రేక్ష్య । దేవం సంప్రోక్ష్య । ఆత్మానంచ సంప్రోక్ష్య ॥
(అంటూ కలశానికి మూడు వైపులా గంధం, కుంకుమ బొట్టు పెట్టి, కలశంలో ఒక పువ్వును వేసి, ఆ పూవుతో కలశోదకములోని నీటిని పూజాద్రవ్యములమీద, దైవము మీదా, తమ మీదా, కొద్దిగా చల్లాలి. తరువాత పసుపుతో చేసిన గణపతిని పూజించాలి)

## పసుపు గణపతి పూజ

శ్లో॥ ఉత్తమం గణనాథస్య వ్రతం సంపత్కరం శుభం ।
భక్తాభీష్టప్రదం తస్మాత్ ధ్యాయేత్ తం విఘ్ననాయకం॥
శ్లో॥ వక్రతుండ! మహాకాయ! కోటిసూర్య సమప్రభ!
నిర్విఘ్నం కురుమే దేవ! సర్వ కార్యేషు సర్వదా!!

(పసుపు వినాయకుడిని విఘ్నేశ్వర స్వరూపంగా భావిస్తూ ఆయన పాదముల చెంత పువ్వులూ, అక్షతలూ వెయ్యాలి. ఏ విధమైన విఘ్నములు దరిచేరక కాపాడుమని ప్రార్థిస్తూ నమస్కరించి, 'శ్రీ మహాగణపతి ప్రసాదం శిరసాగృహ్ణామి' అనుకుంటూ, పసుపు వినాయకుని పాదముల చెంత ఉన్న అక్షతలలో నుంచి కొన్ని అక్షతలు తీసుకుని శిరస్సు మీద వేసుకుని, ఆయన ఆశీర్వాదం పొందినట్లుగా భావించాలి)

శ్రీ మహాగణాధిపతయే నమః ధ్యాయామి ధ్యానం సమర్పయామి । శ్రీ మహాగణాధిపతయే నమః ఆవాహయామి ఆవాహనం సమర్పయామి । శ్రీ మహాగణాధిపతయే నమః ఆసనం సమర్పయామి । శ్రీ మహాగణాధిపతయే నమః హస్తయోః అర్ఘ్యం సమర్పయామి । శ్రీ మహాగణాధిపతయే నమః పాదయోః పాద్యం సమర్పయామి । శ్రీ మహాగణాధిపతయే నమః ఔపచారిక స్నానం సమర్పయామి । స్నానానంతరం శుద్ధ ఆచమనీయం సమర్పయామి । వస్త్రార్థం అక్షతాన్ సమర్పయామి । యజ్ఞోపవీతార్థం అక్షతాన్ సమర్పయామి । గంధాం ధారయామి । గంధస్యోపరి అలంకరణార్థం అక్షతాన్ సమర్పయామి । పుష్పై పూజయామిః ॥

(ఈ క్రింది నామాలు చెప్తూ భక్తితో పూలతో పశుపు గణపతిని పూజించాలి)

ఓం సుముఖాయ నమః । ఏకదంతాయ నమః । కపిలాయ నమః । గజకర్ణికాయనమః ।
లంబోదరాయ నమః । వికటాయ నమః । విఘ్నరాజాయ నమః । గణాధిపాయ నమః ।
ధూమకేతవే నమః । గణాధ్యక్షాయ నమః । ఫాలచంద్రాయ నమః । గజాననాయ నమః ।
వక్రతుండాయ నమః । శూర్పకర్ణాయ నమః । హేరంభాయ నమః ।
స్కంద పూర్వజాయ నమః । శ్రీ మహాగణాధిపతయే నమః ।
నానావిధ పరిమళ పుష్పాణి పూజయామి (సమర్పయామి)

## గుడోపహార నైవేద్యం (బెల్లం ముక్క)

ఓం భూర్భువత్సువహ తత్సవితుర్వరేణ్యం భర్గోదేవస్యధీమహీ
ధియోయోనః ప్రచోదయాత్॥ (అంటూ నీటిని బెల్లం ముక్కపై చల్లాలి)
సత్యంత్వర్తేన పరిషించామి ।
(అంటూ బెల్లంముక్కకు ఎడమ చేతివైపుగా నీటిని చుట్టూ తిప్పుతూ వదిలిపెట్టాలి)
అమృతమస్తు అమృతోపస్తరణమసి (నీటిని బెల్లంముక్కపై మళ్ళీ చల్లాలి)
శ్రీ మహా గణాధిపతయే నమః అవసరార్థం గుడోపహార (బెల్లం ముక్క) నైవేద్యం సమర్పయామి)
ఓం.. ప్రాణాయ స్వాహా । ఓం అపానాయ స్వాహా । ఓం వ్యానాయ స్వాహా ।
ఓం ఉదానాయ స్వాహా । ఓం సమానాయ స్వాహా । ఓం బ్రహ్మణే స్వాహా ॥
(అంటూ అ బెల్లం ముక్కను గణపతికి స్వయంగా నివేదనచేస్తున్నట్లుగా భావించాలి)
మధ్యేమధ్యే పానీయం సమర్పయామి (నీటిని వదిలిపెట్టాలి)
అమృతాపిధానమసి ఉత్తరాపోసనం సమర్పయామి । (నీటిని పదిలిపెట్టాలి)
హస్తౌ ప్రక్షాళయామి । (నీటిని వదిలిపెట్టాలి)
పాదౌ ప్రక్షాళయామి (నీటిని వదిలి పెట్టాలి)
శుద్ధ ఆచమనీయం సమర్పయామి (నీటిని వదిలిపెట్టాలి)
శ్రీ మహా గణాధిపతయే నమః తాంబూలం సమర్పయామి ।
(అంటూ రెండు తమలపాకులలో, రెండు వక్కలు, రెండు రూపాయి బిళ్ళలు, రెండు అరటిపళ్ళ
ముచికలు గిల్లి ఆ తాంబూలాన్ని విఘ్నేశ్వరునికి సమర్పించాలి)
తాంబూలానంతరం కర్పూర నీరాజనం సమర్పయామి॥
(అంటూ కర్పూరం వెలిగించి గణపతికి అద్ది, అనంతరం మన కళ్ళకు అద్దుకోవాలి)
నీరాజనానంతరం శుద్ధ ఆచమనం సమర్పయామి (నీటిని వదిలిపెట్టాలి)
వక్రతుండ మహాకాయ, కోటి సూర్య సమప్రభా ।
నిర్విఘ్నం కురుమేదేవ సర్వకార్యేషు సర్వదా ॥
మహా గణపతయే నమః మంత్ర పుష్పం సమర్పయామి ।
(అంటూ అక్షతలు వదిలిపెట్టవలెను)
మహా గణపతయే నమః ఆత్మప్రదక్షిణ నమస్కారాన్ సమర్పయామి॥
సర్వోపచార పూజాః సమర్పయామి ।
యస్యస్మృత్యాచ నామోక్త్యా తపఃపూజా క్రియాదిషు, న్యూనం సంపూర్ణతాం యాతి, సద్యోవందే
గణాధిప । మంత్రహీనం, క్రియాహీనం భక్తిహీనం గణాధిప, యత్పూజితం మయాదేవ
పరిపూర్ణం తదస్తుతే ।

అనయా షోడశోపచారపూజయా భగవాన్ సర్వదేవాత్మకః శ్రీమహా గణాధిపతి
సుప్రీతో సుప్రసన్నో భవతు (అని అక్షతలూ, పువ్వులూ, నీళ్ళతో సహా వదిలిపెట్టాలి)
శ్రీ మహాగణాధిపతి ప్రసాదం శిరసా గృహ్ణామి ॥
(అని పసుపు గణపతి వద్ద ఉన్న అక్షతలను, పుష్పాలను శిరస్సుపై ధరించవలెను)
(ఇదే విధంగా ప్రతి వ్రతమునకూ ముందుగా వినాయకునికి పూజ జరిపించాలి)

## శ్రీదుర్గాదేవీ నవరాత్ర నిత్యపూజ

మరలా ఆచమనం చేయాలి. ఈ క్రింద చెప్పబడిన కేశవనామాలలో స్వాహా అని చెప్పబడిన మొదటి మూడు నామాలకు ఉద్ధరిణెతో నీటిని ఎడమ చేతితో తీసుకుని కుడి చేతిలోకి పోసుకుని త్రాగవలెను, నాల్గవసారి చేతిలోకి నీరు తీసుకుని పళ్ళెమునందు వదిలి మిగతా నామాలను నమస్కరిస్తూ ఉచ్చరించాలి.

ఓం కేశవాయ స్వాహా, ఓం నారాయణాయ స్వాహా, ఓం మాధవాయ స్వాహా,
ఓం గోవిందాయ నమః, ఓం విష్ణవే నమః, ఓం మధుసూదనాయ నమః, ఓం త్రివిక్రమాయ నమః,
ఓం వామనాయ నమః, ఓం శ్రీధరాయ నమః, ఓం హృషీకేశాయ నమః, ఓం పద్మనాభాయ నమః,
ఓం దామోదరాయ నమః, ఓం సంకర్షణాయ నమః, ఓం వాసుదేవాయ నమః,
ఓం ప్రద్యుమ్నాయ నమః, ఓం అనిరుద్ధాయ నమః, ఓం పురుషోత్తమాయ నమః,
ఓం అధోక్షజాయ నమః, ఓం నారసింహాయ నమః , ఓం అచ్యుతాయ నమః,
ఓం జనార్ధనాయ నమః, ఓం ఉపేంద్రాయ నమః, ఓం హరయే నమః, ఓం శ్రీకృష్ణాయ నమః,
ఓం శ్రీకృష్ణ పరబ్రహ్మణే నమః.

### ధ్యానమ్

దుర్గే దుర్గతిహారిణి త్రిజగతాం సరాది సిద్ధారకే
స్వర్గాదీష్ట ఫలప్రదాననిపుణే త్రాయస్వ నశ్శాంకరి
సాత్వం సర్వజనాంతరాంతర చిదంశానన్య సిద్ధాత్మికా
సారాసార వివేకదృష్టి విదితా సర్వైక సాక్ష్యాత్మనా ॥
మాతర్మే మధుకైటభఘ్ని మహిష ప్రాణాపహారోద్యమే
హేలానిర్మిత ధూమ్రలోచనవధే హే చండముండార్దిని
నిశ్శేషీకృత రక్తబీజదనుజే నిత్యే నిశుంభాపహే
శుంభధ్వంసిని సంహరాశు దురితం దుర్గే నమస్తేంబికే ॥
లక్ష్మీ ప్రదాన సమయే నవవిద్రుమాభాం । విద్యాప్రదానసమయే శరదిందు శుభ్రాం ॥
విద్వేషివర్గ విజయేతు తమాల నీలాం । దేవీంత్రిలోక జననీం శరణం ప్రపద్యే ॥

## ప్రాణప్రతిష్ఠా

అనునీతే పునరస్మా సుచక్షుః పునః ప్రాణ మిహనోధేహి భోగం
జ్యోక్పశ్యేమ సూర్య ముచ్చరంత మనుమతే మృడయానస్వస్తి
అమృతమాపః ప్రాణానేన యధాస్థాన ముపహ్వాయతే
రక్తాంబోధిస్థపోతోల్లసదరుణ సరోజాధిరూఢాకరాబ్జైః
పాశంకోదండ మిక్షూద్భవ మళిగుణమప్యంకుశం పంచబాణాన్
బిభ్రాణాసృక్కపాలం త్రిణయనవిలసత్ పీనవక్షోరుహాఢ్యా
దేవీబాలార్కవర్ణాభవతు సుఖకరీ ప్రాణశక్తిః పరానః
సాంగా సాయుధా సపరివారా శ్రీ మహాకాళీ శ్రీ మహాలక్ష్మీ శ్రీ మహా సరస్వతీ స్వరూపిణీ
శ్రీ దుర్గాంబికా పరదేవతాయై నమః ఆవాహితా భవ స్థాపితా భవ సుప్రీతా భవ సుప్రసన్నా
వరదాభవ. ( అమ్మవారి రూపాన్ని స్మరిస్తూ నమస్కరించుకోవాలి )

## ఆవాహనమ్

హిరణ్యవర్ణాం హరిణీం సువర్ణరజతస్రజాం । చంద్రాంహిరణ్మయీం లక్ష్మీం జాతవేదోమమావహ ॥
నమస్తేస్తు మహాదేవి వరదే విశ్వరక్షిణి । సాన్నిధ్యం కురుమేదేవి జగన్మాతః కృపాపరే ॥
శ్రీ మహాకాళీ శ్రీ మహాలక్ష్మీ శ్రీ మహా సరస్వతీ స్వరూపిణీ శ్రీ దుర్గాంబికా
పరదేవతాయై నమః ధ్యాయామి ఆవాహయామి

(నవరాత్రములలో ఆయా రోజులలో చెప్పబడిన దేవత పేరుతో ఉపచారాలు చేసుకోవాలి. ఉదాహరణకు రెండవ రోజు బాలాత్రిపుర సుందరీ అవతారం. ఆ దేవత పూజా సమయంలో, 'శ్రీ మహా కాళీ శ్రీ మహా లక్ష్మీ శ్రీ మహా సరస్వతీ స్వరూపిణీ శ్రీ బాలా త్రిపుర సుందరీ దేవతాయై నమః ధ్యాయామి ఆవాహయామి' అని.. ఈ విధంగా ప్రతి ఉపచారానికి చెప్పుకోవాలి)

## ఆసనమ్

తాం మ ఆవహ జాతవేదో లక్ష్మీ ముపగామినీం ।
యస్యాం హిరణ్యం విదేయం గామశ్వం పురుషానహమ్ ।ఊ॥
అనేక రత్న సంయుక్తం సువర్ణేన విరాజితం । మనశ్చిత్రం మనోహారి సింహాసనమిదం తవ ॥
శ్రీ మహాకాళీ శ్రీ మహాలక్ష్మీ శ్రీ మహా సరస్వతీ స్వరూపిణీ శ్రీ దుర్గాంబికా వరదేవతాయై నమః
నవరత్న ఖచిత సువర్ణ సింహాసనం సమర్పయామి

## పాద్యమ్

అశ్వపూర్వాం రథమధ్యాం హస్తినాదప్రబోధినీం । శ్రియం దేవీ ముపహ్వయే శ్రీర్మాదేవీజుషతామ్ ॥
అనవద్యగుణీదేవి వరదే విశ్వమాతృకే । మనశ్శుద్ధం మయాదత్తం గాంగమంబుపదోస్తవ ॥
శ్రీ మహాకాళీ శ్రీ మహాలక్ష్మీ శ్రీ మహా సరస్వతీ స్వరూపిణీ శ్రీ దుర్గాంబికా పరదేవతాయై నమః
పాదయోః పాద్యం సమర్పయామి

## అర్ఘ్యమ్

కాంసోస్మితాం హిరణ్య ప్రాకారామార్ద్రాం జ్వలంతీంతృప్తాం తర్పయంతీం ।
పద్మేస్థితాం పద్మవర్ణాం తామిహోపహ్వయే శ్రియం ॥
సర్వతీర్థమయం హృద్యం బహుపుష్పసువాసితం । ఇదమర్ఘ్యం మయాదత్తం గృహాణవరదాయిని ॥
శ్రీ మహాకాళీ శ్రీ మహాలక్ష్మీ శ్రీ మహా సరస్వతీ స్వరూపిణీ శ్రీ దుర్గాంబికా పరదేవతాయై నమః
హస్తయోః అర్ఘ్యం సమర్పయామి

## ఆచమనీయమ్

చంద్రాంప్రభాసాం యశసాజ్వలతీం శ్రియంలోకే దేవజుష్టాముదారాం ।
తాంపద్మినీమీం శరణమహం ప్రపద్యేऽలక్ష్మీర్మేనశ్యతాం త్వాంవృణే ॥
పూర్ణచంద్ర సమానాభే కోటిసూర్యసమప్రభే । గృహాణాచమనం దేవి నిర్మలం రుచిపూరకమ్ ॥
శ్రీ మహాకాళీ శ్రీ మహాలక్ష్మీ శ్రీ మహా సరస్వతీ స్వరూపిణీ శ్రీ దుర్గాంబికా పరదేవతాయై నమః
ముఖే ఆచమనీయం సమర్పయామి

## మధుపర్కమ్

(పెరుగు, తేనె, నేయి కలిపిన పదార్థాన్ని మధుపర్కము అంటారు)
మధ్వాజ్యదధిసంయుక్తం శర్కరాజలసంయుతం । మధుపర్కం గృహాణత్వం దుర్గాదేవి నమోస్తుతే ॥
శ్రీ మహాకాళీ శ్రీ మహాలక్ష్మీ శ్రీ మహా సరస్వతీ స్వరూపిణీ శ్రీ దుర్గాంబికా పరదేవతాయై నమః
మధుపర్కం సమర్పయామి

## స్నానమ్

ఆదిత్యవర్ణే తపసోధిజాతో వనస్పతిస్తవ వృక్షోథబిల్వః ।
తస్య ఫలాని తపసానుదత్తు మాయాంతరాయాశ్చ బాహ్యా అలక్ష్మీః ॥
ఓం ఆపోహిష్ఠామయోభువః తాన ఊర్జేదధాతన । మహేరణాయ చక్షసే యోవశ్శివతమోరసః ।
తస్య భాజయతేహనః ఉశతీరివమాతరః ।
తస్మాఅరంగమామవో యస్యక్షయాయ జిన్వథ ఆపోజనయథాచనః ॥
నమస్తేస్తు జగన్మాతః వరదే విశ్వమాతృకే । ఇదం శుద్ధోదకస్నానం స్వీకురుష్వదయామతే ॥
శ్రీ మహాకాళీ శ్రీ మహాలక్ష్మీ శ్రీ మహా సరస్వతీ స్వరూపిణీ శ్రీ దుర్గాంబికా పరదేవతాయై నమః
శుద్ధోదక స్నానం సమర్పయామి

## పంచామృత స్నానం

### క్షీరం (పాలు )

ఆప్యాయస్వమేతు తే విశ్వతస్సోమవృష్ణియం భవావాజస్య సంగథే ॥

(క్షీరేణ స్నపయామి)

### దధి (పెరుగు)

దధిక్రావణ్ణో అకారిషం జిష్ణో రశ్వస్యవాజినః సురభినో ముఖాకరత్ప్రణ ఆయూగ్ంషితారిషత్ ॥

(దధ్నా స్నపయామి)

### ఆజ్యం (నెయ్యి)

శుక్రమసిజ్యోతిరసి తేజో2సి దేవోస్సవితోత్పు నాత్వచ్ఛిద్రేణ పవిత్రేణ వసోస్సూర్యస్యరశ్మిభిః

(ఆజ్యేన స్నపయామి)

### మధు (తేనె)

మధువాతా ఋతాయతే మధుక్షరన్తి సింధవః మాధ్వీర్నస్సంత్వోషధీః మధునక్తముతోషసి

మధుమాగ్ం అస్తు సూర్యః మాధ్వీర్గావో భవంతునః

(మధునా స్నపయామి)

### శర్కర (చక్కెర)

తాశ్శర్కరా అభవస్త చ్ఛర్కరాగ్ం శర్కరత్వం ! వజ్రో వైశర్కరాః పశురగ్నిచ్ఛరరాభి రగ్నిం పరిమినోతి ॥

(శర్కరయా స్నపయామి)

### నారికేళ ఫలోదక స్నానమ్

యాః ఫలినీర్యా అఫలాయాశ్చ పుష్పిణీః. బృహస్పతి ప్రసూతాస్తానో ముంచం త్వగ్ంహసః

(నారికేళ ఫలోదకేన స్నపయామి)

## శుద్ధోదక స్నానమ్

ఓం ఆపోహిషామయోభువస్తాన ఊర్జే దధాతన, మహేరణాయ చక్షసే యోవశ్శివతమోరసః

తస్యభాజయతే హనః ఉశతీరిమమాతరః,

తస్మా అరంగమామవో యస్యక్షయాయ జిన్వథ ఆపోజన యధాచనః ॥

శ్రీ మహాకాళీ శ్రీ మహాలక్ష్మీ శ్రీ మహా సరస్వతీ స్వరూపిణీ శ్రీ దుర్గాంబికా పరదేవతాయై నమః

పంచామృత స్నానం, శుద్ధోదక స్నానం సమర్పయామి

## వస్త్రమ్

ఉపైతుమాందేవసఖః కీర్తిశ్చమణినాసహ । ప్రాదుర్భూతోస్మిరాష్ట్రేస్మిన్ కీర్తిమృద్ధిందదాతుమే ॥
అభివస్త్రాసువసనాన్యషాభిధేనూ సుదుఘాః పూయమానాః ।
అభిచంద్రాభర్తవేనో హిరణ్యాభ్యశ్వాన్ రధినోదేవసోమ ॥
అంబరంచాపి కౌసుంభం స్వర్ణ రేఖాంచితం శుభం ।
వస్త్రమేతన్మయాదత్తం కృపయా పరిగృహ్యతామ్ ॥
శ్రీ మహాకాళీ శ్రీ మహాలక్ష్మీ శ్రీ మహా సరస్వతీ స్వరూపిణీ శ్రీ దుర్గాంబికా పరదేవతాయై నమః
వస్త్రయుగ్మం సమర్పయామి

## యజ్ఞోపవీతమ్

క్షుత్పిపాసామలాం జ్యేష్ఠామలక్ష్మీర్నాశయామ్యహం
అభూతిమ సమృద్ధిం చ సర్వాం నిర్ణుదమేగృహాత్ ॥
యజ్ఞోపవీతం పరమం పవిత్రం ప్రజాపతేర్యత్సహజం పురస్తాత్ ।
ఆయుష్యమగ్ర్యం ప్రతిముంచశుభ్రం యజ్ఞోపవీతంబలమస్తు తేజః ॥
నమస్తుభ్యం జగద్ధాత్రి చంద్రకోటి మనోహరే । ఉపవీతమిదం దేవి గృహాణ త్వం ప్రసీదమే ॥
శ్రీ మహాకాళీ శ్రీ మహాలక్ష్మీ శ్రీ మహా సరస్వతీ స్వరూపిణీ శ్రీ దుర్గాంబికా పరదేవతాయై నమః
యజ్ఞోపవీతమ్ సమర్పయామి

## ఆభరణమ్

నానావిధాని రత్నాని మాంగళ్యాభరణానిచ । సౌవర్ణాని చ దీయంతే గృహాణ పరదేవతే ॥
శ్రీ మహాకాళీశ్రీ మహాలక్ష్మీ శ్రీ మహా సరస్వతీ స్వరూపిణీ శ్రీ దుర్గాంబికా పరదేవతాయై నమః
సర్వాభరణాని సమర్పయామి ( ఆభరణార్థం అక్షతాన్ సమర్పయామి)

## గంధమ్

గంధద్వారాం దురాధర్షాం నిత్య పుష్టాం కరీషిణీం ।
ఈశ్వరీగ్ం సర్వభూతానాం తామిహోపహ్వయే శ్రియమ్ ॥
ఇష్టగంధప్రదం దేవి అష్టగంధాధి వాసితం । అంగరాగం మహాదేవి గృహాణ సుమనోహరమ్ ॥
శ్రీ మహాకాళీ శ్రీ మహాలక్ష్మీ శ్రీ మహా సరస్వతీ స్వరూపిణీ శ్రీ దుర్గాంబికా పరదేవతాయై నమః
దివ్యశ్రీ గంధం సమర్పయామి

## పసుపు

అహిరివభోగైః పర్యేతి బాహుం జ్యాయాహేతిం పరిబాధమానః ।
హస్తఘ్నో విశ్వావయునాని విద్వాన్ పుమాన్ పుమాగ్ంస ం పరిపాతు విశ్వతః ॥
శ్రీ మహాకాళీ, శ్రీ మహాలక్ష్మీ శ్రీ మహా సరస్వతీ స్వరూపిణీ శ్రీ దుర్గాంబికా పరదేవతాయై నమః
హరిద్రాచూర్ణం సమర్పయామి.

## కుంకుమ

యాగ్ం కుర్యాసినీవాలీ యా రాకా యా సరస్వతీ । ఇంద్రాణీ మహ్వ ఉత యేవరుణానీం స్వస్తయే ॥

శ్రీ మహాకాళీ శ్రీ మహాలక్ష్మీ శ్రీ మహా సరస్వతీ స్వరూపిణీ శ్రీ దుర్గాంబికా పరదేవతాయై నమః
కుంకుమం సమర్పయామి సమర్పయామి

## పుష్పాలతో పూజ

మనసఃకామమాకూతింవాచస్పత్యమశీమహి। పశూనాగ్ం రూపమన్నస్య మయి శ్రీః శ్రయతాంయశః॥

నానావిధైశ్చ కుసుమైః బహువర్ణైసుగంధిభిః । పూజయామ్యహమంబత్వాం ప్రసీద పరమేశ్వరి ॥
శ్రీ మహాకాళీ శ్రీ మహాలక్ష్మీ శ్రీ మహా సరస్వతీ స్వరూపిణీ శ్రీ దుర్గాంబికా, పరదేవతాయై నమః
నానావిధ పరిమళ పత్రపుష్పాణి సమర్పయామి

## అంగ పూజ

ఓం దుర్గాయై నమః పాదౌ పూజయామి ।
ఓం జైత్ర్యై నమః గుల్ఫౌ పూజయామి
ఓం మంగళాయై నమః జానునీ పూజయామి ।
ఓం కాల్యై నమః ఊరూ పూజయామి ।
ఓం సర్వఋషిపత్నీభిరర్చితాయై నమః కటిం పూజయామి ।
ఓం జన్మహీనాయై నమః జఘనం పూజయామి ।
ఓం గమ్భీరనాభయే నమః నాభిం పూజయామి ।
ఓం హరిపూజ్యాయై నమః ఉదరం పూజయామి ।
ఓం కౌమార్యై నమః హృదయం పూజయామి ।
ఓం మదనలోకమాత్రే నమః స్తనౌ పూజయామి ।
ఓం స్కందమాత్రే నమః భుజద్వయం పూజయామి ।
ఓం అభయప్రదాయై నమః దక్షిణహస్తౌ పూజయామి ।
ఓం పుస్తక ధారిణే నమః వామహస్తౌ పూజయామి ।
ఓం స్వధాయై నమః కంఠం పూజయామి ।
ఓం మహిషాసురమర్దిన్యై నమః నేత్రే పూజయామి ।
ఓం సింహవాహనాయై నమః ముఖం పూజయామి ।
ఓం శివాయై నమః లలాటం పూజయామి ।
ఓం అంబికాయై నమః శిరః పూజయామి ।
ఓం మహాదైవ్యై నమః సర్వాణ్యంగాని పూజయామి ॥
శ్రీ మహాకాళీ శ్రీ మహాలక్ష్మీ శ్రీ మహా సరస్వతీ స్వరూపిణీ శ్రీ దుర్గాంబికా పరదేవతాయై నమః
సర్వాణ్యంగాని సమర్పయామి

## శ్రీ దుర్గాష్టోత్తర శతనామావళి

ఓం దుర్గాయై నమః
ఓం శివాయై నమః
ఓం మహాలక్ష్మైనమః
ఓం మహాగౌర్యై నమః
ఓం చండికాయై నమః
ఓం సర్వజ్ఞాయై నమః
ఓం సర్వలోకేశ్యై నమః
ఓం సర్వకర్మ ఫలప్రదాయై నమః
ఓం సర్వతీర్ధమయ్యై నమః
ఓం పుణ్యాయై నమః
ఓం దేవయోనయే నమః
ఓం నిర్గుణాయై నమః
ఓం ఆధారశక్త్యై నమః
ఓం అనీశ్వర్యై నమః
ఓం నిర్గమాయై నమః
ఓం నిరాకారాయై నమః
ఓం సర్వగర్వవిమర్దిన్యై నమః
ఓం సర్వలోకప్రియాయై నమః
ఓం వాణ్యై నమః
ఓం సర్వవిద్యాధి దేవతాయై నమః
ఓం పార్వత్యై నమః
ఓం దేవమాత్రే నమః
ఓం అనీశాయై నమః
ఓం వింధ్యవాసిన్యై నమః
ఓం తేజోవత్యై నమః
ఓం మహామాత్రే నమః
ఓం కోటిసూర్యసమప్రభాయై నమః
ఓం దేవతాయై నమః
ఓం వహ్నిరూపాయై నమః
ఓం తేజసే నమః
ఓం వర్ణరూపిణ్యై నమః
ఓం గుణాశ్రయాయై నమః
ఓం గుణమధ్యాయై నమః
ఓం గుణత్రయవివర్జితాయై నమః
ఓం కర్మజ్ఞానప్రదాయై నమః
ఓం కాంతాయై నమః
ఓం సర్వకారిణ్యై నమః
ఓం ధర్మజ్ఞానాయై నమః
ఓం ధర్మనిష్టాయై నమః
ఓం సర్వకర్మవివర్జితాయై నమః
ఓం కామాక్ష్యై నమః
ఓం సర్వసంహార్యై నమః
ఓం కామక్రోధవివర్జితాయై నమః
ఓం శాంకర్యై నమః
ఓం శాంభవ్యై నమః
ఓం శాంతాయై నమః
ఓం చంద్రసూర్యాగ్నిలోచనాయై నమః
ఓం సుజయాయై నమః
ఓం జయభూమిష్ఠాయై నమః
ఓం జాహ్నవ్యై నమః
ఓం జనపూజితాయై నమః
ఓం శాస్త్రాయై నమః
ఓం శాస్త్రమయ్యై నమః
ఓం నిత్యాయై నమః

ఓం శుభాయై నమః
ఓం చంద్రార్ధమస్తకాయై నమః
ఓం భారత్యై నమః
ఓం భ్రామర్యై నమః
ఓం కల్పాయై నమః
ఓం కరాళ్యై నమః
ఓం కృష్ణపింగళాయై నమః
ఓం బ్రాహ్మై నమః
ఓం నారాయణ్యై నమః
ఓం రౌద్ర్యై నమః
ఓం చంద్రామృతపరిస్రుతాయై నమః
ఓం జ్యేష్ఠాయై నమః
ఓం ఇందిరాయై నమః
ఓం మహామాయాయై నమః
ఓం జగత్సృష్ట్యాధికారిణ్యై నమః
ఓం బ్రహ్మాండకోటి సంస్థాయై నమః
ఓం కామిన్యై నమః
ఓం కమలాలయాయై నమః
ఓం కాత్యాయన్యై నమః
ఓం కాలాతీతాయై నమః
ఓం కాలసంహారకారిణ్యై నమః
ఓం యోగనిష్ఠాయై నమః
ఓం యోగిగమ్యాయై నమః
ఓం యోగిధ్యేయాయై నమః
ఓం తపస్విన్యై నమః
ఓం జ్ఞానరూపాయై నమః
ఓం నిరాకారాయై నమః

ఓం భక్తాభీష్టఫలప్రదాయై నమః
ఓం భూతాత్మికాయై నమః
ఓం భూతమాత్రే నమః
ఓం భూతేశ్యై నమః
ఓం భూతధారిణ్యై నమః
ఓం సురనారీమధ్యగతాయై నమః
ఓం షడాధార వివర్ధిన్యై నమః
ఓం మోహితాయై నమః
ఓం అంశుభవాయై నమః
ఓం శుభ్రాయై నమః
ఓం సూక్ష్మాయై నమః
ఓం మాత్రాయై నమః
ఓం నిరాలసాయై నమః
ఓం నిమగ్నాయై నమః
ఓం నీలసంకాశాయై నమః
ఓం నిత్యాయై నమః
ఓం నందిన్యై నమః
ఓం హరాయై నమః
ఓం పరాయై నమ:
ఓం సర్వజ్ఞానప్రదాయై నమః
ఓం అనంతాయై నమః
ఓం సత్యాయై నమః
ఓం దుర్లభరూపిణ్యై నమః
ఓం సరస్వత్యై నమః
ఓం సర్వగతాయై నమః
ఓం సర్వాభీష్టప్రదాయై నమః
ఓం శ్రీ దుర్గాంబికాయై నమః

శ్రీ మహాకాళీ శ్రీ మహాలక్ష్మీ శ్రీ మహా సరస్వతీ స్వరూపిణీ శ్రీ దుర్గాంబికా పరదేవతాయై నమః
నానావిధ పరిమళ పత్ర పుష్పాణి సమర్పయామి,

## దకారాది శ్రీ దుర్గాష్టోత్తర శతనామావళి

ఓం దుర్గాయై నమః
ఓం దుర్గమార్గస్థలస్థానాయై నమః
ఓం దుర్గతిహరాయై నమః
ఓం దుర్గమార్గవిలాసిన్యై నమః
ఓం దుర్గాచలనివాసిన్యై నమః
ఓం దుర్గమార్గత్యక్తాస్త్రాయై నమః
ఓం దుర్గమార్గానుసంచారాయై నమః
ఓం దుర్గమార్గప్రవర్తిన్యై నమః
ఓం దుర్గమార్గ నివాసిన్యై నమః
ఓం దుర్గాసురనిహంత్ర్యై నమః
ఓం దుర్గమార్గ ప్రవిష్టాయై నమః
ఓం దుర్గాసుర నిషూదిన్యై నమః
ఓం దుర్గమార్గ ప్రవేశిన్యై నమః
ఓం దుర్గాసురహరాయై నమః
ఓం దుర్గమార్గకృతావాసాయై నమః
ఓం దుర్గమాయై నమః
ఓం దుర్గమార్గజయ ప్రియాయై నమః
ఓం దుర్గాసురవధోన్మత్తాయై నమః
ఓం దుర్గమార్గగృహీతార్చాయై నమః
ఓం దుర్గాసురవధోత్సాహాయై నమః
ఓం దుర్గమార్గస్థితాత్మికాయై నమః
ఓం దుర్గాసురవధోద్యతాయై నమః
ఓం దుర్గమార్గస్తుతిపరాయై నమః
ఓం దుర్గాసురవధప్రేప్స్యాయై నమః
ఓం దుర్గమార్గ స్మృతి పరాయై నమః
ఓం దుర్గాసురమఖాంతక ృతే నమః
ఓం దుర్గమార్గసదాస్థాయిన్యై నమః
ఓం దుర్గాసురధ్వంసతోషాయై నమః
ఓం దుర్గమార్గరతి ప్రియాయై నమః
ఓం దుర్గాదానవదారిణ్యై నమః
ఓం దుర్గయుద్ధమహోమత్తాయై నమః
ఓం దుర్గావిద్రావణకర్త్ర్యై నమః
ఓం దుర్గయుద్ధానుసారిణ్యై నమః
ఓం దుర్గవిద్రావిణ్యై నమః
ఓం దుర్గయుద్ధోత్సాహాయై నమః
ఓం దుర్గవిక్షోభణ కర్త్ర్యై నమః
ఓం దుర్గదేశనిషేవిణ్యై నమః
ఓం దుర్గశీర్షనికృన్తిన్యై నమః
ఓం దుర్గదేశ వాసరతాయై నమః
ఓం దుర్గవిధ్వంసనకర్త్ర్యై నమః
ఓం దుర్గదేశవిలాసిన్యై నమః
ఓం దుర్గదైత్యనికృన్తిన్యై నమః
ఓం దుఃఖహంత్ర్యై నమః
ఓం దుర్గదైత్యప్రాణహరాయై నమః
ఓం దుర్గదైత్యాంతకారిణ్యై నమః
ఓం దేవకామాయై నమః
ఓం దుర్గదైత్యహరత్రాత్ర్యై నమః
ఓం దేవదేవ ప్రియాయై నమః
ఓం దుర్గదైత్యాసృగున్మదాయై నమః
ఓం దేవదానవవందితాయై నమః
ఓం దుర్గదైత్యాశనకర్త్ర్యై నమః
ఓం దేవదేవ విలాసిన్యై నమః
ఓం దుర్గచర్మాంబరావృతాయై నమః
ఓం దేవదేవసుఖప్రదాయై నమః
ఓం దుర్గయుద్ధవిశారదాయై నమః
ఓం దేవదేవగతాత్మికాయై నమః

ఓం దుర్గయుద్ధోత్సవకర్త్ర్యై నమః
ఓం దేవతాతనవే నమః
ఓం దుర్గయుద్ధాసవరతాయై నమః
ఓం దయాసింధవే నమః
ఓం దుర్గయుద్ధవిమర్ధిన్యై నమః
ఓం దయాంబుధయే నమః
ఓం దుర్గయుద్ధాట్టహాసిన్యై నమః
ఓం దయాసాగరాయై నమః
ఓం దుర్గయుద్ధహాస్యరతాయై నమః
ఓం దయాయై నమః
ఓం దుఃఖహీనాయై నమః
ఓం దయాళవే నమః
ఓం దీనబంధవే నమః
ఓం దయాశీలాయై నమః
ఓం దక్షహంత్రే నమః
ఓం దయార్ద్రహృదయాయై నమః
ఓం దీనమాత్రే నమః
ఓం దేవ్యై నమః
ఓం దక్షాధ్వర వినాశిన్యై నమః
ఓం దరాందోళిత దీర్ఘాక్ష్యై నమః
ఓం దీన సేవ్యాయై నమః
ఓం దీర్ఘచక్షుషే నమః
ఓం దేశకాల పరిచ్ఛిన్నాయై నమః
ఓం దీర్ఘలోచనాయై నమః
ఓం సిద్ధాయై నమః
ఓం దీర్ఘనేత్రాయై నమః
ఓం దీనవత్సలాయై నమః
ఓం దీర్ఘబాహవే నమః
ఓం దేవకన్యాయై నమః
ఓం దీర్ఘసాగరమధ్యస్థాయై నమః
ఓం దేవమాన్యాయై నమః
ఓం దయాశ్రయాయై నమః
ఓం దేవసిద్ధాయై నమః
ఓం దయాంబునిధయే నమః
ఓం దేవపూజ్యాయై నమః
ఓం దాశరథి ప్రియాయై నమః
ఓం దేవదేవ్యాయై నమః
ఓం దశభుజాయై నమః
ఓం దేవవందితాయై నమః
ఓం దిగంబరవిలాసిన్యై నమః
ఓం దైవ్యై నమః
ఓం దుర్గమాయై నమః
ఓం దేవధన్యాయై నమః
ఓం దురితాపహారిణ్యై నమః
ఓం దేవరమ్యాయై నమః
ఓం దుష్ట దూరాయై నమః
ఓం దురాచార్య శమన్యై నమః
ఓం దౌహృదాయై నమః
ఓం దీనబంధవాయై నమః
ఓం దారిద్ర్యధ్వంసిన్యై నమః
ఓం శ్రీ దుర్గాంబికాయై నమః ॥

శ్రీ మహాకాళీ శ్రీ మహాలక్ష్మీ శ్రీ మహా సరస్వతీ స్వరూపిణీ శ్రీ దుర్గాంబికా పరదేవతాయై నమః
నానావిధ పరిమళ పత్రపుష్పాణి సమర్పయామి.

## ధూపమ్

కర్దమేన ప్రజా భూతా మయి సంభవ కర్దమ । శ్రియం దాపయమేకులే మాతరం పద్మమాలినీమ్ ॥
ఓం ధూరసి ధూర్వ ధూర్వంతం ధూర్వతంయో2స్మాన్। ధూరసి తంధూర్వయం వయం ధూర్వామః॥
జగదంబే నమస్తేస్తు కరుణాపూరపూరితే। ధూపమేతన్మయాదత్తం గృహాణ వరదేంబికే ॥
శ్రీ మహాకాళీ శ్రీ మహాలక్ష్మీ శ్రీ మహా సరస్వతీ స్వరూపిణీ శ్రీ దుర్గాంబికా పరదేవతాయై నమః
ధూపమాఘ్రాపయామి

## దీపమ్

ఆపస్సజంతు స్నిగ్ధాని చిక్లీత వసమే గృహే । నిచదేవీం మాతరం శ్రియం వాసయమేకులే ॥
కృపాపరే మహాదేవి జగద్రక్షణ తత్పరే । చంద్రరేఖాంకమకుటే దీపోయం ప్రతిగృహ్యతామ్ ॥
శ్రీ మహాకాళీ శ్రీ మహాలక్ష్మీ శ్రీ మహా సరస్వతీ స్వరూపిణీ శ్రీ దుర్గాంబికా
పరదేవతాయై నమః దీపం దర్శయామి
ధూప, దీపానంతరమ్ శుద్ధాచమనీయం సమర్పయామి

## నైవేద్యమ్

ఆర్ద్రాం పుష్కరిణీం పుష్టిం పింగళాం పద్మమాలినీం ।
చంద్రాంహిరణ్మయీం లక్ష్మీం జాతవేదో మమావహ ॥
భక్తేష్టదాన వరదే భక్తపాలన తత్పరే । సర్వదేవాత్మికే దేవి నైవేద్యం ప్రతిగృహ్యతామ్ ॥
(తరువాత గాయత్రీ మంత్రమును చదువుతూ ప్రోక్షణ చెయ్యవలెను. )
ఓం భూర్భవస్సువః తత్సవితుర్వరేణ్యం భర్గోదేవస్య ధీమహి ధియోయోనః ప్రచోదయాత్ ॥
సత్యం త్వర్తేన పరిషించామి (పగటి పూట) ఋతంత్వాసత్యేన పరిషించామి (రాత్రి పూట)
(అంటూ నైవేద్య పదార్థాలకు కుడివైపుగా నీళ్ళ వదులుతూ తిప్పాలి)
శ్రీ మహాకాళీ శ్రీ మహాలక్ష్మీ శ్రీ మహా సరస్వతీ స్వరూపిణీ శ్రీ దుర్గాంబికా వరదేవతాయై నమః
మహా నైవేద్యం సమర్పయామి..
అమృతమస్తు, అమృతోపస్తరణమసి (నేవేద్య పదార్థములపై పుష్పముతో నీటిని కొద్దిగా చల్లాలి)
(నైవేద్య పదార్థాలను భక్తితో స్వయంగా నివేదిస్తున్నట్లుగా భావిస్తూ...)
ఓం ప్రాణాయ స్వాహా । ఓం అపానాయ స్వాహా । ఓం వ్యానాయ స్వాహా ॥
ఓం ఉదానాయ స్వాహా । ఓం సమానాయ స్వాహా ।
(ఈ విధంగా ప్రాణాహుతులు సమర్పించవలెను)
మధ్యే మధ్యే పానీయం సమర్పయామి ।ఉత్తరాపోశనం సమర్పయామి,
హస్తౌ ప్రక్షాళయామి, పాదౌ ప్రక్షాళయామి,
శుద్ధాచమనీయం సమర్పయామి ।

## తాంబూలమ్

ఆర్ద్రాం యఃకరిణీం యష్టిం సువర్ణాం హేమమాలినీం ।
సూర్యాం హిరణ్మయీం లక్ష్మీం జాతవేదో మమావహ ॥
తాంబూల పూరితముఖి సర్వవిద్యా స్వరూపిణి । సర్వమంత్రాత్మికేదేవి తాంబూలం ప్రతిగృహ్యతామ్ ॥
శ్రీ మహాకాళీ శ్రీ మహాలక్ష్మీ శ్రీ మహా సరస్వతీ స్వరూపిణీ శ్రీ దుర్గాంబికా పరదేవతాయై నమః
తాంబూలం సమర్పయామి

## నీరాజనమ్

తాం మ ఆవహజాతవేదో లక్ష్మీ ముపగామినీం ।
యస్యాం హిరణ్యం ప్రభూతంగావోదాస్యోశ్వాన్ విందేయం పురుషానహమ్ ॥
హిరణ్యపాత్రం మధోః పూర్ణందదాతి మధ్వ్యోసానీతి ।
ఏకధాబ్రహ్మణ ఉపహరతే ఏకధైవయజమానః ఆయుస్తేజోదధాతి ॥
సామ్రాజ్యం భోజ్యం స్వారాజ్యం వైరాజ్యం । పారమేష్టిగ్ రాజ్యం మహారాజమాధిపత్యమ్ ॥
కర్పూరకాంతి విలసన్ముఖవర్ణ విరాజితే । నీరాజనం మయాదత్తం కృపయా ప్రతిగృహ్యతామ్ ॥
శ్రీ మహాకాళీ శ్రీ మహాలక్ష్మీ శ్రీ మహా సరస్వతీ స్వరూపిణీ శ్రీ దుర్గాంబికా పరదేవతాయై నమః
ఆనంద కర్పూర నీరాజనం సమర్పయామి
నీరాజనానంతరం శుద్ధాచమనీయం సమర్పయామి..

## మంత్రపుష్పము

జాతవేదసే సునవామ సోమమరాతీయతో నిదహాతి వేదః
సనః పర్షదతి దుర్గాణి విశ్వానావేవ సింధుం దురితాత్యగ్నిః
తామగ్నివర్ణాం తపసాజ్వలంతీం వైరోచనీం కర్మ ఫలేషు జుష్టాన్
దుర్గాం దేవీగ్ం శరణమహం ప్రపద్యే సుతరసి తరసే నమః
అగ్నే త్వం పారయా నవ్యో అస్మాన్ స్వస్తిభి రతి దుర్గాణి విశ్వా
పూశ్చ పృథ్వీ బహులాన ఉర్వీ భవాతోకాయ తనయాయ తంయోః
విశ్వాని నోదుర్గహా జాతవేద స్సింధుం ననావా దురితాతి పర్షి
అగ్నే అత్రివన్మనసా గృణానో స్మాకం బోధ్యవితా తనూనామ్
పృతనాజితగ్ం సహమాన ముగ్ర మగ్నిం హంవేమ పరమాత్సధస్థాన్
సనః పర్షదతి దుర్గాణి విశ్వాక్షామద్దేవో అతిదురితాత్యగ్నిః
ప్రత్నోష్షికమీడ్యో అధ్వరేషు సనాచ్చ హెూతా నవ్యశ్చ సత్సి
స్వాంచాగ్నే తనువం పిప్రయస్వాస్మభ్యంచ సౌభగ మాయజస్వ
గోభి ర్జుష్టమయుజో నిషిక్తం తవేంద్ర విష్ణో రనుసంచరేమ

నాకస్య పృష్ఠే మభిసంవసానో వైష్ణవీం లోక ఇహ మాదయంతామ్
కాత్యాయనాయవిద్మహే కన్య కుమారి ధీమహి తన్నో దుర్గిః ప్రచోదయాత్ ॥
సహస్ర పరమాదేవీ శతమూలా శతాఃంకురా ।
సర్వగ్ంం హరతుమే పాపం దూర్వా దుస్వప్న నాశినీ॥ కాండాత్కాండాత్పరోహంతీ పరుష పరుషః పరి।
ఏవానో దూర్వేప్రతను సహస్రేణ విరోహసి। తస్యాస్తే దేవీష్టకే విధేమ హవిషావయం॥
అశ్వక్రాస్తే రథక్రాస్తే విష్ణుక్రాస్తే వసున్ధరా । శిరసాధారయిష్యామి రక్షస్వ మాం పదేపదే ॥
యోవేదాదౌ స్వరః ప్రోక్తో వేదాన్తేచ ప్రతిష్ఠితః । తస్యప్రక ృతి లీనస్య యఃపరః స మహేశ్వరః ॥

శ్రీ మహాకాళీ శ్రీ మహాలక్ష్మీ శ్రీ మహా సరస్వతీ స్వరూపిణీ శ్రీ దుర్గాంబికా పరదేవతాయై నమః
పాదారవిదయోః సువర్ణ దివ్య మంత్ర పుష్పం సమర్పయామి.

## సాష్టాంగనమస్కారమ్

ఉరసాశిరసాదృష్ట్యా మనసావచసా తథా । పద్భ్యాం కరాభ్యాం కర్ణాభ్యాం ప్రణామోష్టాంగ ఉచ్యతే ॥
శ్రీ మహాకాళీ శ్రీ మహాలక్ష్మీ శ్రీ మహా సరస్వతీ స్వరూపిణీ శ్రీ దుర్గాంబికా పరదేవతాయై నమః
సాష్టాంగ నమస్కారం సమర్పయామి

## ఆత్మప్రదక్షిణ నమస్కారం

యానికానిచపాపాని జన్మాంతరకృతానిచ । తానికాని ప్రణశ్యంతు ప్రదక్షిణ పదే పదే ॥
పాపోహం పాపకర్మాహం పాపాత్మా పాపసంభవః ।
త్రాహిమాం కృపయా దేవి శరణాగత వత్సలే ॥

శ్రీ మహాకాళీ శ్రీ మహాలక్ష్మీ శ్రీ మహా సరస్వతీ స్వరూపిణీ శ్రీ దుర్గాంబికా పరదేవతాయై నమః
ఆత్మ ప్రదక్షిణ నమస్కారం సమర్పయామి.

## ప్రార్థన

దుర్గే దుర్గతిహారిణి త్రిజగతాం స్వర్గాది సిద్ధార్థకే । స్వర్గాదీష్టఫలప్రదాననిపుణే త్రాయస్వ నశ్శాంకరి ॥
సాత్వం సర్వజనాంతరాంతర చిదం శానస్యసిద్ధాత్మికా ।
సారాసార వివేక దృష్టి విదితా సర్వైక సాక్ష్యాత్మనా ॥
మాతర్మే మధుకైటభఘ్ని మహిషప్రాణాపహారోద్యమే।
హేలానిర్మిత ధూమ్రలోచనవధే హే చండముండార్థిని ।
నిశ్శేషీకృత రక్తబీజదనుజే నిత్యే నిశుంభాపహే ।
శుంభధ్వంసిని సంహరాశు దురితం దుర్గే నమస్తేంబికే ॥
లక్ష్మీ ప్రదాన సమయే నవవిద్రుమాభాం । విద్యా ప్రదానసమయే శరదిందు శుభ్రాం ।
విద్వేషివర్గ విజయేతు తమాల నీలాం। దేవీం త్రిలోక జననీం శరణం ప్రపద్యే ॥

రసం రూపం చ గంధం చ శబ్దం స్పర్శంచ యోగినీ। సత్త్వం రజస్తమశ్చైవ రక్షే న్నారాయణీ సదా॥
యద్యత్ ద్రవ్యమ పూర్వంచ పృధివ్యావతి దుర్లభం। దేవభూపార లోగ్యం చ తత్తత్ ద్రవ్యమిదంతవ॥
శ్రీ మహాకాళీ శ్రీ మహాలక్ష్మీ శ్రీ మహా సరస్వతీ స్వరూపిణీ శ్రీ దుర్గాంబికా పరదేవతాయై నమః
ప్రార్థన నమస్కారాన్ సమర్పయామి.
ఛత్రం ధారయామి, చామరం వీజయామి, గీతం శ్రావయామి, నృత్యం దర్శయామి.
ఆందోళికానారోహయామి, అశ్వానారోహయామి, గజానారోహయామి, సమస్త దేవోపచార
రాజోపచార భక్త్యుపచార శక్త్యుపచార పూజాః సమర్పయామి॥

## అపరాధ క్షమాపణమ్

అపరాధ సహస్రాణి క్రియంతే అహర్నిశం మయా। పుత్రోయమితి మాం మత్వా క్షమస్వ పరమేశ్వరీ॥
ఆవాహనం నజానామి నజానామి విసర్జనం। పూజా విధిం నజానామి క్షమస్వ పరమేశ్వరీ॥
యస్యస్మృత్యాచ నామోక్త్యా తపఃపూజా క్రియాదిషు।
న్యూనం సంపూర్ణతాం యాతి, సద్యోవందే మహేశ్వరి।
మంత్రహీనం, క్రియాహీనం భక్తిహీనం మహేశ్వరి। యత్పూజితం మయాదేవ పరిపూర్ణం తదస్తుతే।
మంత్రహీనం క్రియాహీనం భక్తిహీనం పరాత్పరే। యత్పూజితం మయా దేవి పరిపూర్ణం తదస్తుతే॥
అనయా మయా కృత పూజయా శ్రీ మహాకాళీ శ్రీ మహాలక్ష్మీ శ్రీ మహా సరస్వతీ స్వరూపిణీ
శ్రీ దుర్గాంబికా సుప్రీతా సుప్రసన్నా వరదా భవతు

## ఉద్వాసనం

ఓం సహస్ర పరమాదేవీ శతమూలా శతాంకురా।
సర్వగ్ం హరతుమే పాపం దూర్వా దుస్వప్న నాశినీ॥
ఓం యజ్ఞేన యజ్ఞమయజంత దేవాస్తాని ధర్మాణి ప్రధమాన్యాసన్।
తేహనాకం మహిమానస్సచంతే యత్ర పూర్వే సాధ్యాసంతి దేవాః॥
(శ్రీ మహాకాళీ శ్రీ మహాలక్ష్మీ శ్రీ మహా సరస్వతీ స్వరూపిణీ శ్రీ దుర్గాంబికా పరదేవతాం యథాస్థానం
ఉద్వాసయామి శోభనార్థం పునరాగమనాయచ )

## తీర్థం

అకాలమృత్యుహరణం సర్వవ్యాధి నివారణం।
సమస్త పాప క్షయకరం శ్రీ మహాకాళీ శ్రీ మహాలక్ష్మీ శ్రీ మహా సరస్వతీ స్వరూపిణీ
శ్రీ దుర్గాంబికా పాదోదకం పావనం శుభమ్॥
హరిః ఓం తత్సత్ ! సర్వం శ్రీ మహాకాళీ శ్రీ మహాలక్ష్మీ శ్రీ మహా సరస్వతీ
స్వరూపిణీ శ్రీ దుర్గాంబికాపరదేవతార్పణమస్తు !

## సప్తశ్లోకీ దుర్గా స్తోత్రమ్

శ్రీమహాకాళీ మహాలక్ష్మీ మహాసరస్వత్యో దేవతా స్వరూప శ్రీ దుర్గా ప్రీత్యర్థం
సప్తశ్లోకీ దుర్గాపాఠే వినియోగః

ఓం జ్ఞానినామపి చేతాంసి దేవీ భగవతీ హి సా। బలాదా కృష్య మోహాయ మహామాయా ప్రయచ్ఛతి
దుర్గే స్మృతా హరసి భీతి మశేషజంతోః। స్వస్థైః స్మృతా మతిమతీవ శుభం దదాసి ॥
దారిద్ర్యదుఃఖభయహారిణి కా త్వదన్యా। సర్వోపకారకరణాయ సదార్ద్రచిత్తా ॥
సర్వమంగళ మాంగళ్యే శివే సర్వార్థసాధికే। శరణ్యే త్ర్యంబకే గౌరి నారాయణి నమోస్తు తే ॥
శరణాగతదీనార్తపరిత్రాణపరాయణే। సర్వస్యార్తిహరే దేవి నారాయణి నమోస్తు తే ॥
సర్వస్వరూపే సర్వేశే సర్వశక్తిసమన్వితే। భయేభ్య స్త్రాహి నో దేవి దుర్గే దేవి నమోస్తు తే ॥
రోగానశేషానపహంసి తుష్టా। రుష్టా తు కామాన్ సకలానభీష్టాన్ ॥
త్వామాశ్రితానాం న విపన్నరాణాం। త్వామాశ్రితా హ్యాశ్రయతాం ప్రయాంతి ॥
సర్వా బాధా ప్రశమనం త్రైలోక్యస్యాఖిలేశ్వరి। ఏవమేవ త్వయా కార్యమస్మద్వైరవినాశనమ్ ॥

ఇతి శ్రీ సప్తశ్లోకీ దుర్గా స్తోత్రమ్ సంపూర్ణం

## దుర్గాద్వాత్రింశ నామమాలా

దుర్గాదుర్గార్తిశమనీ దుర్గాపద్వినివారిణీ। దుర్గమచ్ఛేదినీ దుర్గసాధినీ దుర్గనాశినీ ॥
దుర్గతోద్ధారిణీ దుర్గనిహంత్రీ దుర్గమాపహా। దుర్గమజ్ఞానదా దుర్గదైత్యలోకదవానలా ॥
దుర్గమా దుర్గమాలోకా దుర్గమాత్మస్వరూపిణీ। దుర్గమార్గప్రదా దుర్గమవిద్యా దుర్గమాశ్రితా ॥
దుర్గమజ్ఞానసంస్థాన దుర్గమధ్యాన భాసినీ। దుర్గమోహా దుర్గమగా దుర్గమార్థస్వరూపిణీ ॥
దుర్గమాసురసంహాత్రీ దుర్గమాయుధధారిణీ। దుర్గమాఙ్గీ దుర్గమతా దుర్గమ్యా దుర్గమేశ్వరీ ॥
దుర్గభీమా దుర్గభామా దుర్గభా దుర్గధారిణీ। నామావళీమిమాం యస్తు దుర్గాయా మమ మానవః।
పఠేత్ సర్వభయాన్ముక్తో భవిష్యతి న సంశయః ॥
ఇతి సప్త శ్లోకీ దుర్గా

## నవదుర్గా శ్లోకము

ప్రథమం శైలపుత్రీతి ద్వితీయం బ్రహ్మచారిణీ। తృతీయం చంద్రఘంటేతి కూష్మాండేతి చతుర్థకమ్ ॥
పంచమం స్కందమాతేతి షష్ఠం కాత్యాయనీతిచ। సప్తమం కాళరాత్రీతి మహా గౌరీతిచాష్ఠమమ్ ॥
నవమం సిద్ధిదాత్రీచ నవదుర్గాః ప్రకీర్తితాః
(శ్రీ దుర్గాదేవీ శరన్నవరాత్ర నిత్య పూజా సంపూర్ణమ్)



కృష్ణవేణీతటావాసాం ఇన్ద్రకీలనగ స్థితామ్।
శరణ్యాం సర్వలోకానాం స్వర్ణదుర్గాం సమాశ్రయే ॥

# శరన్నవరాత్రులు-సర్వసౌభాగ్య సోపానాలు!

## ముందుమాట:

పాఠకులందరికి శరన్నవరాత్ర శుభాభినందనలు!

ఆశ్వయుజ మాసంలో వచ్చే శరన్నవరాత్రులు అమ్మవారి ఆరాధనకు అతి ప్రీతిపాత్రమైన కాలంగా మనకు పెద్దల ద్వారా, పురాణాల ద్వారా తెలుస్తోంది. ప్రతిరోజూ భగవంతుని ఆరాధనకు బ్రాహ్మి సమయం, సంధ్యా సమయం ఎంత అత్యుత్తమమైనవో, అలాగే ఏడాది లో ఆశ్వయుజ మాసం లో శుక్ల పక్షంలో పాడ్యమి మొదలు నవమి తిథి వరకు ఉన్న తొమ్మిది రోజులు అమ్మవారి ఆరాధనకు, సాధనకు అంత అత్యుత్తమమైన సమయంగా ఋషుల చేత నిర్ణయింపబడినదని మనకు తెలుస్తోంది. శరదృతువులో భారతదేశం అంతా సమతుల్యమైన ఉష్ణోగ్రత ఉండటం వలన సాధనకు చాల అనువైన కాలంగా కూడా చెప్పబడుతుంది.

ఈ పవిత్ర పర్వ దినాలలో మన పాఠకులకు ప్రత్యేకంగా శరన్నవరాత్రి విశిష్టతను మరొక్క సారి గుర్తుకు తెస్తూ **శ్రీమతి నయన కస్తూరి** గారు ముందుగా శరన్నవరాత్రుల వైభవాన్ని వివరించటమే కాక, ఈ నవ రాత్రులలో ప్రతిరోజు, ఆ మరుసటి రోజు యొక్క దేవీ అలంకార ప్రభావాన్ని విశదీకరిస్తూ, అ దేవికి సమర్పించే ప్రత్యేక నివేదన గురించి ప్రస్తావించటం జరుగుతుంది. పాఠకులు గమనించవలసిన విషయం ఏమిటంటే, ఈ దేవి అలంకారాలూ, నివేదనలు, ప్రాంతానుసారం ఉత్తర, తూర్పు, దక్షిణభారతాలలో కొంత మార్పుతో ఉంటాయి. అంతేకాక అచ్చటి దేవీ క్షేత్రాల సంప్రదాయం అనుసరించి కూడా స్వల్పమైన మార్పుతో ఉండవచ్చు. మనం ఇక్కడ పొందుపరిచేవి, ఇంద్రకీలాద్రిపై వేంచేసిన కనకదుర్గామాతకు జరిపే అలంకారాలను అనుసరించి వుంటాయి.

కనుక ఈ నెల 10 వ తేదీ నుండి, ఈ నెల 19 వ తేదీ వరుకు కొనసాగే దేవి నవరాత్రులలో పాఠకులంతా అమ్మవారి వివిధ రూపాలని అర్చించి తరించగలరని ఆశిస్తూ, మన అందరిపై ఆ తల్లి కృపాకటాక్షవీక్షణాలు నిరంతరం నిలవాలని కోరుకుంటున్నాము.

హిందువులు జరుపుకునే పర్వదినాలలో శరన్నవరాత్రులు విశేషమైన పండుగ రోజులు. ఈ పవిత్రరాత్రులు శరదృతువులో ఆశ్వయుజ శుక్ల పాడ్యమి నాడు మొదలై , విజయదశమితో ముగుస్తాయని ఇంతకు ముందే చెప్పుకున్నాము. అసలు ఈ నవరాత్రులు మనం ఎందుకు చేసుకుంటామో చూద్దాం. మన పురాణాల్లో అనేక కథలు వున్నా, అన్నీ చెప్తున్నవి ఏమిటంటే, ఎప్పుడైనా చెడుపై మంచికే విజయం లభిస్తుందని! దుష్టశక్తి ని అణచడానికి దైవశక్తి ఆవిర్భిస్తుందని!

పూర్వం శివుని దగ్గర అమరత్వాన్ని వరంగా పొందిన మహిషాసురుడనే రాక్షసుడు గర్వాంధుడై , దేవతలతోసహా సమస్త ప్రాణికోటిని అంతమొందించే సమయంలో, అందరూ కలిసి

తమను రక్షించవలసినదిగా ఆ జగన్మాతను వేడుకున్నారు. మనకు ఏ కష్టం వచ్చినా అమ్మే కదా ఆదుకునేది! తక్షణమే జగన్మాత దుర్గాదేవిగా అవతరించి, మహిషాసురుడిని యుద్ధానికి ప్రేరేపించి, తొమ్మిది రోజులు పోరాడి, తొమ్మిదో రోజున ఆ రక్కసుని అంతమొందించి, దుష్ట శిక్షణ – శిష్ట రక్షణ గావించింది. కావునే ఈ తొమ్మిది రోజులు అందరూ భక్తిశ్రద్ధలతో అమ్మ వారిని పూజించి, పదవ రోజున అమ్మ వారి విజయానికి సంకేతంగా ఆనందోత్సాహాలతో, భక్తిశ్రద్ధలతో విజయదశమి సంబరాలు జరుపుకుంటారు. అందుకే ఈ నవరాత్రులను 'దేవీనవరాత్రులు' అని కూడా అంటారు.

మరొక కథనం ప్రకారం శ్రీ రాముడు రావణుడిని సంహరించి, సీతాదేవితో అయోధ్యకు తిరిగి వచ్చిన 'దశమి'నాటి సంతోష సందర్భములో ప్రజలంతా ఆనందంగా విజయదశమిని జరుపుకున్నారని, అప్పటి నుండి అదే అలవాటుగా ప్రతి సంవత్సరం జరుపుకుంటున్నారని నమ్ముతారు. ఏమైనా ఈ విజయ దశమి పండుగ, చెడుపై మంచి సాధించిన విజయానికి చిహ్నమని అందరూ ఒప్పుకుంటారు.



ఈ పండగ ఎలా జరుపుకుంటారో మీకందరకు సుపరిచితమే అయినా ఇక్కడ క్లుప్తంగా వివరిస్తాను. ఆశ్వయుజ శుక్ల పాడ్యమి నాడు కలశస్థాపన చేసి, అమ్మవారిని ఆవాహన చేసి, ఒక్కో రోజు ఒకొక్క విధంగా అమ్మ వారిని అలంకరించి, విశేషమైన పూజ చేసి ఆ అవతారంలో అమ్మ వారికి అత్యంత ప్రీతికరమైన వంటకం చేసి భక్తిగా నివేదిస్తారు. ఆ వివరాలు కూడా రోజువారీగా మీకు గుర్తు చేస్తాను. ఇప్పుడు మాత్రం, ఈ నవరాత్రులలో సాధారణంగా ఏమేమి పాటిస్తారో ఒక్క సారి మననం చేసుకుందాం.

ఈ నవరాత్రి ఉత్సవాలు, కొందరు కొన్ని నియమాలు పాటిస్తూ, తొమ్మిది రోజులు పూజలు చేసుకుంటారు. తొమ్మిది రోజులు అమ్మ వారిని వివిధ అలంకారాలు చేసి, ఆయా దేవతా స్వరూపాలకి శోడషోపచారాలతో అష్టోత్తరపూజ చేసుకుని, ఆ రోజు నిర్దేశింపబడ్డ వంటకాన్ని చేసి నివేదించుకుంటారు. మరి కొందరు పగలంతా ఉపవాసం ఉండి, రాత్రికి భోజనం చేస్తారు. తొమ్మిది రోజులు చేసే ఓపిక, సమయం లేని వారు త్రిరాత్రవ్రతమని సరస్వతీదేవి పూజ రోజు నుండి (మూలా నక్షత్రం వున్న రోజున సరస్వతీ దేవి పూజ చేస్తారు) చివరి మూడు రాత్రులు చేసుకుంటారు.

కొన్ని ప్రాంతాల ప్రజలు సంక్రాంతి పండగ సమయంలో బొమ్మల కొలువును పెట్టుకుంటే, మరి కొన్ని ప్రాంతాల వారు శరన్నవరాత్రులలో బొమ్మల కొలువును పెట్టుకుని, అమ్మవారికి అర్చన,

దీప ధూప నివేదనలు చేసి, హారతులిచ్చి, పేరంటం చేసుకుంటారు. ఈ బొమ్మల కొలువులు రకరకాల బొమ్మలతో చూడటానికి కన్నుల పండుగగా ఏర్పాటు చేస్తారు. దుర్గాష్టమినాడు అనగా, ఎనిమిదవ రోజున బాల పూజ అని, ఆరు సంవత్సరాల నుండి పన్నెండు సంవత్సరాలలోపు తొమ్మిదిమంది ఆడ పిల్లలను అమ్మవారి రూపంగా భావించి, సకల ఉపచారాలతో పూజిస్తారు. ముత్తైదువులకు 'సువాసిని 'పూజలు చేస్తారు. పట్టు వస్త్రాలతో ఆడవారంతా చూడ ముచ్చటగా వుండి, పెళ్లి సందడి లాగే వుంటుంది. ఈ కన్యపూజ కాని, ముత్తైదు పూజ కాని స్త్రీ శక్తికి మన సంప్రదాయాలు ఎంత ప్రాముఖ్యతని ఆపాదిస్తున్నాయో చెప్పకనే చెప్తాయి.

ఇక పాండవులచే మొదలు పెట్టబడిన ఆయుధ పూజ ఇప్పటికి మహానవమి నాడు కొంతమందికీ విజయదశమి నాడు కొంతమందికీ కర్మాగారాల్లో యంత్రాలకు, రైతులు వారి వ్యవసాయ పనిముట్లకి, వివిధ వాహనాలకి చేసే పూజల రూపంలో ఇప్పటికీ కొనసాగిస్తూనే ఉన్నాము. శమీవృక్షానికి పాండవులు చేసినట్లుగా మనం కూడా ప్రదక్షణలు చేసి, ఈ క్రింది శ్లోకాన్ని ఎంతో భక్తిగా పఠిస్తాము.

'శమీ శమయతే పాపం శమీ శత్రు వినాశనీ అర్జునస్య ధనుర్ధారీ రామస్య ప్రియదర్శినీ!'

ఈ నవరాత్రుల పర్వ దినాల్లోనే తెలంగాణా ప్రాంత ప్రజలు బతుకమ్మ పండగను తొమ్మిది రోజులు ఎంతో వైభవంగా ఘనంగా జరుపుకుంటారు. ఇవి పవిత్రమైన రోజులు కనుక స్త్రీలు 'గ్రామ కుంకుమ నోము' 'కైలాసగౌరి నోము' లాంటి పెద్ద నోములు చేసుకుంటారు. విజయదశమినాడు సకల శక్తిస్వరూపిణి అయిన జగన్మాతను భక్తిశ్రద్ధలతో పూజించుకుని, ఒకరినొకరు అభినందించుకుని వారివారి సంతోషంకొలది కానుకలు ఇచ్చుకుంటారు. ఇదివరలో గురువులు విద్యార్థులతో కలిసి అందరి ఇళ్ళకు వెళ్లి, 'అయ్య వారికి చాలు అయిదు వరహాలు, పిల్ల వాళ్లకు చాలు పప్పు బెల్లాలు' అంటూ పిల్లలు పాడగా, తల్లిదండ్రులు ఇచ్చిన కానుకలను సంతోషంగా స్వీకరించేవారు. అదే కాలక్రమేణా 'దసరామామూలు'గా రూపాంతరం చెందినట్లుగా తెలుస్తోంది.

ఇక నవరాత్రులలో భక్తులు అమ్మవారిని ఒక్కో రోజు ఏయే అలంకరణలతో అర్చించి, ఏ విధమైన నివేదనలు సమర్పిస్తారో గుర్తు చేసుకుందాం. ముందు మనవి చేసినట్టు, ఈ అలంకారాలు ప్రాంతానుసారం, క్షేత్రానుసారంగా స్వల్పమైన మార్పులతో ఉండవచ్చు. ఇలా తొమ్మిది రోజులు ఆయా అలంకారాలతో పూజించి విజయదశమి నాడు పరిపూర్ణమూర్తి అయిన జగన్మాతను శ్రీ రాజరాజేశ్వరీ దేవి అలంకారంలో పూజించి, లడ్డూతో సహా మహా నివేదన చేస్తారు. ఇక సామూహికంగా భక్తులు వీధుల్లోను, భవన సముదాయాలలోనూ అమ్మవారి పెద్ద విగ్రహాలను నిలిపి పూజలు జరిపేవారు ఆఖరి రోజున సాంప్రదాయంగా నిమజ్జన కార్యక్రమాన్ని నిర్వహిస్తారు.

## ఈ నవరాత్రులలో మనం దర్శించే అమ్మవారి

## అలంకారాలు మరియు నివేదనలు

### మొదటి రోజు

శ్రీ స్వర్ణకవచాలంకృత దుర్గాదేవి - బంగారు రంగు

నివేదన – తీపి బూంది, సుండలు.

### రెండవ రోజు

శ్రీ బాలా త్రిపురసుందరీదేవి - లేత గులాబీ రంగు

నివేదన – పెసర పప్పు పాయసం.

### మూడవ రోజు

శ్రీ గాయత్రీదేవి - కనకాంబరం రంగు

నివేదన – అల్లపు గారెలు.

### నాల్గవ రోజు

శ్రీ అన్నపూర్ణాదేవి - గంధం రంగు

నివేదన – దద్ధోజనం, కట్టె పొంగలి.

### ఐదవ రోజు

శ్రీ లలితా త్రిపురసుందరీదేవి - బంగారు వర్ణం

నివేదన – పులిహోర, పెసరబూరెలు.

### ఆరవ రోజు

శ్రీ మహాలక్ష్మీదేవి - గులాబీ రంగు

నివేదన - పూర్ణాలు, క్షీరాన్నం.

### ఏడవ రోజు

శ్రీ సరస్వతీదేవి (మూలా నక్షత్రం) - తెలుపు రంగు

నివేదన – అన్నం పరమాన్నం, దద్ధోజనం, అటుకులు, బెల్లం, శనగ పప్పు.

### ఎనిమిదవ రోజు

శ్రీ దుర్గాదేవి (దుర్గాష్టమి) - ఎరుపు రంగు

నివేదన – పులగాన్నం, పులిహోర.

### తొమ్మిదవ రోజు

శ్రీ మహిషాసుర మర్ధని (మహర్నవమి) - కాఫీ రంగు

నివేదన – పులగాన్నం, పులిహోర, గారెలు, నిమ్మరసం, వడపప్పు, పానకం.

### పదవ రోజు

శ్రీ రాజరాజేశ్వరీదేవి (విజయ దశమి) - ఆకుపచ్చ రంగు

# స్వర్ణ కవచాలంకృత శ్రీ కనకదుర్గాదేవి



## ప్రథమం - ప్రసన్న రూపం - శ్రీ స్వర్ణకవచాలంకృత దేవీ అలంకారం

వసంత ఋతువు దేవీ పూజకు ఎంత శ్రేష్టమో శరదృతువు కూడా అమ్మ ఆరాధనకు అంతే శ్రేష్ఠం. వేదాలు ఆవిర్భవించక పూర్వం నుండే శ్రీ శక్తిని పూజించే విధానం పురాణేతిహాసాల ద్వారా మనకు విదితమవుతోంది. మహాభారత సమయంలో శ్రీ కృష్ణుడు పాండవుల విజయం కోసం అమ్మవారిని ప్రార్థించిన దాఖలాలు ఉన్నాయి. ఈ నవరాత్రులలో దేవీ ఆరాధనే ప్రముఖంగా వుంటుంది కనుక ఈ నవరాత్రులు, దేవీ నవరాత్రులుగా కూడా భక్తులచే పిలవబడుతున్నాయి. మనం నవరాత్రులలో ఏ రోజు ఏ శక్తి రూపానికి పూజలు జరిపిస్తామో చెప్పుకున్నాం కదా? ఆ ప్రకారం నవరాత్రుల యందు ప్రథమమైన శుక్ల పాడ్యమి రోజున అలరారించే సువర్ణ కవచాలంకృత దేవీ దివ్య రూపాన్ని, ఒకసారి కనులు మూసుకుని ఆ సువర్ణ దివ్యమంగళ విగ్రహాన్ని మనసు నిండా నింపుకుని, ధ్యానించుకుందాము.

"ఓం హిరణ్య వర్ణాం హరిణీం సువర్ణ రజత స్రజాం!
చంద్రాం హిరణ్మయిం లక్ష్మీం జాతవేదో మా అవహా!"

"అమ్మ మనసు ఎప్పుడూ బంగారమే! ఇక రూపం కూడా సువర్ణమైతే చెప్పేదేముంది? అమ్మ వారి స్వర్ణకవచాలంకారం వీక్షించడానికి సహస్రాక్షువులు ఉన్నా తక్కువే! అమ్మ అందం స్వర్ణ కవచాలంకరణతో ద్విగుణీకృతం అవుతుంది. అష్ట భుజాలతో శంఖ, చక్ర, గదాంకుశ, త్రిశూల ధారి అయి, అలరారుతుంది. శ్రీ మాత శ్రీ మహారాజ్ఞి గా సువర్ణ రత్న ఖచిత సింహాసనం మీద ఆసీనురాలై చిరుమందహాసంతో భక్తుల కోరికలు ఈడేరుస్తుంది. ఆ శాంభవి యొక్క సువర్ణ కవచం భక్తుల పాలిట రక్షణ కవచం అవుతుంది. ఆపదలకు అడ్డు కాస్తుంది. ఆ దివ్య మంగళ విగ్రహాన్ని మనస్సులో ప్రతిష్ఠించుకుని, శ్రీదుర్గాఅష్టోత్తరంతో షోడశోపచార పూజలు నిర్వహించి, రాజోపచారాలు, భక్తోపచారాలు, శక్త్యోపచారాలు జరిపి తీపి బూందీని, నాన బెట్టిన శనగలు (సుండలు ) శ్రద్ధగా చేసి, భక్తిగా నివేదించుకుని, మంగళ నీరాజనాలు అద్ది, శ్రీ లలితా సహస్రనామ స్తోత్రం, శ్రీ దుర్గా చాలీసా పారాయణం చేసి, మొదటి రోజు పూజ ముగించుకుందాము.

ధరించవలసిన వర్ణం: బంగారు రంగు లేదా పసుపు

ఇక ఈ నాటి అమ్మ వారి ప్రసాదాల తయారీని తెలుసుకుందాం.

**తీపి బూందీ:**

రెండు గ్లాసుల జల్లించిన శనగపిండిని తీసుకోండి. తగినన్ని నీళ్ళు తీసుకుని పిండిని జాలువారుగా కలుపుకోండి. ఒక బాండీలో రెండు గ్లాసుల పంచదార రెండు గ్లాసుల నీళ్ళలో కలిపి, స్టవ్ మీద పెట్టి తీగపాకం పట్టుకోవాలి. పాకాన్ని పక్కకు పెట్టి, ఇంకొక బాండీ లో నూనె పోసి స్టవ్ మీద పెట్టాలి, నూనె కాగాక బూంది చట్రం తీసుకుని, దాని మీద ఇంకొక గరిటతో పిండి పోసి, కింద నుండి బూందీ ఆకారంలో పడేలా తిప్పుతూ వుండాలి. బూందీ మరీ కరకర మనకుండానే తీసి, పంచదారపాకంలో వేస్తూ వుండాలి. పాకానికి సరిపడా బూందీ అయ్యాక బాగా కలిపి, ఒక పళ్ళెంలో కి తీసుకుని ఆరబెట్టు కోవాలి. బూందీ పాకం పీల్చుకుని బాగుంటుంది.

శనగల సుండలు:

ఒక అరకిలో శనగలు ముందు రోజు రాత్రి బాగా కడిగి నాన బెట్టుకోవాలి. మరునాడు నానిన శనగలను తీసి సరిపడా నీరు పోసి కుక్కర్‌లో ఉడక బెట్టుకోవాలి. బాగా ఉడకడానికి కుక్కర్ ఆరు విజిల్స్ వచ్చేదాకా ఉంచాలి. ఉడికిన తర్వాత చిల్లుల బుట్టలో వేసి నీళ్ళు పోనివ్వాలి. ఒక బాండీలో కొంచెం నూనె కానీ నెయ్యి కానీ వేసి, నాలుగు ఎండు మిరపకాయ ముక్కలు, రెండు చెంచాల మినప్పప్పు, అరచెంచా ఆవాలు, చెంచాడు జీలకర్ర వేసి, పోపు వేయించుకోవాలి. చివరలో నాలుగు పచ్చి మిరపకాయ ముక్కలు కూడా వేసి వేయించాలి. ఒక చిటికెడు పసుపు, తగినంత ఉప్పు వేసి బాగా కలుపుకోవాలి. సుండలు తయార్! ఈ సుండలంటే అమ్మ వారికి అత్యంత ప్రీతి సుమండీ!

ఇతర నివేదనలు:

పై చెప్పినవే కాక కొందరు పెసర సున్నుండలు కూడా తయారు చేసి నివేదించటం కద్దు!

పెసర సున్నుండలు :

పెసర పప్పు ని వేయించి, మెత్తగా పొడి చేసుకుని, పెసర పిండి, చెక్కర ను కలిపి, కరిగించిన నేతిని తగినంత వేసి, యాలకుల పొడి వేసి చక్కగా ఉండలు కట్టుకుంటే పెసర సున్నుండలు తయార్!

## 1.శ్రీ దుర్గాష్టోత్తర శతనామావళి

ఓం దుర్గాయై నమః
ఓం శివాయై నమః
ఓం మహాలక్ష్మైనమః
ఓం మహాగౌర్యై నమః
ఓం చండికాయై నమః
ఓం సర్వజ్ఞాయై నమః
ఓం సర్వలోకేశ్యై నమః
ఓం సర్వకర్మ ఫలప్రదాయై నమః
ఓం సర్వతీర్ధమయ్యై నమః
ఓం పుణ్యాయై నమః
ఓం దేవయోనయే నమః
ఓం నిర్గుణాయై నమః
ఓం ఆధారశక్త్యై నమః
ఓం అనీశ్వర్యై నమః
ఓం నిర్గమాయై నమః
ఓం నిరాకారాయై నమః
ఓం సర్వగర్వవిమర్దిన్యై నమః
ఓం సర్వలోకప్రియాయై నమః
ఓం వాణ్యై నమః
ఓం సర్వవిద్యాధి దేవతాయై నమః
ఓం పార్వత్యై నమః
ఓం దేవమాత్రే నమః
ఓం అనీశాయై నమః
ఓం వింధ్యవాసిన్యై నమః
ఓం తేజోవత్యై నమః
ఓం మహామాత్రే నమః
ఓం కోటిసూర్యసమప్రభాయై నమః
ఓం దేవతాయై నమః
ఓం వహ్నిరూపాయై నమః
ఓం తేజసే నమః
ఓం వర్ణరూపిణ్యై నమః
ఓం గుణాశ్రయాయై నమః
ఓం గుణమధ్యాయై నమః
ఓం గుణత్రయవివర్జితాయై నమః

ఓం కర్మజ్ఞానప్రదాయై నమః
ఓం కాంతాయై నమః
ఓం సర్వకారిణ్యై నమః
ఓం ధర్మజ్ఞానాయై నమః
ఓం ధర్మనిష్ఠాయై నమః
ఓం సర్వకర్మవివర్జితాయై నమః
ఓం కామాక్ష్యై నమః
ఓం సర్వసంహార్యై నమః
ఓం కామక్రోధవివర్జితాయై నమః
ఓం శాంకర్యై నమః
ఓం శాంభవ్యై నమః
ఓం శాంతాయై నమః
ఓం చంద్రసూర్యాగ్నిలోచనాయై నమః
ఓం సుజయాయై నమః
ఓం జయభూమిష్ఠాయై నమః
ఓం జాహ్నవ్యై నమః
ఓం జనపూజితాయై నమః
ఓం శాస్త్రాయై నమః
ఓం శాస్త్రమయ్యై నమః
ఓం నిత్యాయై నమః
ఓం శుభాయై నమః
ఓం చంద్రార్ధమస్తకాయై నమః
ఓం భారత్యై నమః
ఓం భ్రామర్యై నమః
ఓం కల్పాయై నమః
ఓం కరాళ్యై నమః
ఓం కృష్ణపింగళాయై నమః
ఓం బ్రాహ్మ్యై నమః
ఓం నారాయణ్యై నమః
ఓం రౌద్ర్యై నమః
ఓం చంద్రామృతపరిస్రుతాయై నమః
ఓం జ్యేష్ఠాయై నమః
ఓం ఇందిరాయై నమః
ఓం మహామాయాయై నమః
ఓం జగత్సృష్ట్యాధికారిణ్యై నమః
ఓం బ్రహ్మాండకోటి సంస్థాయై నమః
ఓం కామిన్యై నమః
ఓం కమలాలయాయై నమః
ఓం కాత్యాయన్యై నమః
ఓం కాలాతీతాయై నమః
ఓం కాలసంహారకారిణ్యై నమః
ఓం యోగనిష్ఠాయై నమః
ఓం యోగిగమ్యాయై నమః
ఓం యోగిధ్యేయాయై నమః
ఓం తపస్విన్యై నమః
ఓం జ్ఞానరూపాయై నమః
ఓం నిరాకారాయై నమః
ఓం భక్తాభీష్టఫలప్రదాయై నమః
ఓం భూతాత్మికాయై నమః
ఓం భూతమాత్రే నమః
ఓం భూతేశ్యై నమః
ఓం భూతధారిణ్యై నమః
ఓం సురనారీమధ్యగతాయై నమః
ఓం షడాధార వివర్ధిన్యై నమః
ఓం మోహితాయై నమః
ఓం అంశుభవాయై నమః
ఓం శుభ్రాయై నమః
ఓం సూక్ష్మాయై నమః
ఓం మాత్రాయై నమః
ఓం నిరాలసాయై నమః

ఓం నిమగ్నాయై నమః
ఓం నీలసంకాశాయై నమః
ఓం నిత్యాయై నమః
ఓం నందిన్యై నమః
ఓం హరాయై నమః
ఓం పరాయై నమః
ఓం సర్వజ్ఞానప్రదాయై నమః
ఓం అనంతాయై నమః
ఓం సత్యాయై నమః
ఓం దుర్లభరూపిణ్యై నమః
ఓం సరస్వత్యై నమః
ఓం సర్వగతాయై నమః
ఓం సర్వాభీష్టప్రదాయై నమః
ఓం శ్రీ దుర్గాంబికాయై నమః

శ్రీ మహాకాళీ శ్రీ మహాలక్ష్మీ శ్రీ మహా సరస్వతీ స్వరూపిణీ శ్రీ దుర్గాంబికా పరదేవతాయై నమః
శ్రీ దుర్గాష్టోత్తర శతనామావళి పూజా సమర్పయామి,

# శ్రీ బాలా త్రిపురసుందరీ దేవి

అరుణ కిరణ జాలై రంజితా సావకాశా
విధృత జపతటీకాపుస్తకాభీతిహస్తా,
ఇతర వరకారాధ్యా ఫుల్లకల్హాలసంస్థా
నివసతు హృదిబాలా నిత్యకల్యాణశీలా ॥

## 2.ద్వితీయం-అద్వితీయం! బాలా త్రిపురసుందరీ దేవి అలంకారం

నవరాత్రులలో మొదటి రోజున భక్తులందరూ అమ్మ వారిని మనసారా శ్రద్ధాభక్తుల తో అర్చించుకుని అద్భుతమైన అనుభూతిని పొంది జన్మ ధన్యం చేసుకుని ఉంటారు. విదియ తిథి నాడు ఆ శక్తి స్వరూపిణిని ఏ విధం గా అలంకరించుకోవాలో, ఏ నామంతో అర్చించుకోవాలో, ఏ పదార్ధం అమ్మ వారికి నివేదన చెయ్యాలో, మనం ఏమి చేస్తే అమ్మ అనుగ్రహం శీఘ్రంగా పొందగలమో తెలుసుకుని నవరాత్రులలో రెండవ రోజు పూజకు సిద్ధమవుదాం.

దేవీనవరాత్రులలో రెండవరోజును 'ప్రీతి ద్వితీయం' అని పిలుస్తారు. ఎందుకంటే ఈ రోజు అమ్మవారికి చాలా ప్రీతికరమైన రోజు అని పెద్దలు చెపుతారు. దేదీప్యంగా విరాజిల్లే అమ్మ వారి

ద్వితీయ అలంకారం 'శ్రీ బాలా త్రిపురసుందరీదేవి అలంకారం'. త్రిపురత్రయంలో ప్రథమ శక్తి స్వరూపిణి ఈ దేవత. ఈ రోజున నిర్మలమైన, ముద్దులొలికే ముచ్చటైన బాలామణి రూపంలో పూజలందుకుంటుంది ఆ తల్లి. సాక్షాత్తూ, సర్వేశ్వరుడైన త్రిపురేశ్వరుని అర్ధాంగి అయిన జగన్మాతే ఈ బాలాత్రిపురసుందరీ దేవి!

త్రిపురాంతకం అనబడే ఒక శైవక్షేత్రంలో అమ్మను ఈ రూపంలో దర్శించుకోవచ్చు. త్రిపురాసురుడనే ఒక భీకర రాక్షసుడ్ని అంతమొందించి, భక్తుల కొంగు బంగారం చేయడానికి త్రిపురేశ్వరుడు మరియు త్రిపురసుందరీ దేవి ఈ క్షేత్రంలో కొలువై ఉన్నారు. ఈ అవతారంలో అమ్మ అభయహస్త ముద్ర కలిగి అక్షరమాలను ధరించి వుంటుంది. దేదీప్యమానమైన ఈ దివ్యమంగళ రూపాన్ని మనఃఫలకంపై నిలుపుకుని, ఆరాధిస్తే భక్తుల మనస్సుని, బుద్ధిని తేజోవంతం చేస్తుంది. ఆరు సంవత్సరాల నుండి పన్నెండు సంవత్సరాల లోపు బాలికలకు పూజలు చేసినట్లైతే, అమ్మ తక్షణం అనుగ్రహిస్తుంది. శ్రీ చక్రంలోని ప్రథమ దేవత ఈ రూపం! సమస్త కళలకు అధినేత ఈ దేవత. ఏ కళలో రాణించాలన్నా ఈమె చల్లని చూపులు మన మీద పడాలి. ఈ బాలాత్రిపురసుందరీ దేవి ఆరాధనలో భాగం గానే నవరాత్రులలో 'బాల పూజ' విశిష్ట స్థానం పొందింది. రెండవ రోజైన విదియ నాడు 'ఓం ఐం హ్రీం శ్రీం శ్రీ బాల త్రిపురసున్దర్యై నమః' అని వీలైనన్ని సార్లు జపించుకుంటే చాలా శుభప్రదం! శ్రీ బాల త్రిపుర సుందరి అష్టోత్రంతో షోడశోపచార పూజ చేసి పెసరపప్పు పాయసం నివేదన చేయాలి.

ఈ నాడు ధరించవలసిన వర్ణం: లేత గులాబీ రంగు

ఈ నాటి నివేదన: పెసర పప్పు పాయసం

ఈ పాయసం చేయడం చాలా తేలిక. ఒక పావు గ్లాసు పెసరపప్పు మెత్తగా ఉడికించి పెట్టుకోవాలి. ఒక చిన్న బాండీలో ఒక ఒక అరగ్లాసు బెల్లం తురుము వేసి, ఒక అరగ్లాసు నీళ్ళు పోసి, పాకం పట్టాలి. కొంచెం లేత తీగపాకం రాగానే, ఉడికిన పెసరపప్పును బాగా చిదివమి, పాకంలో వేసి బాగా కలుపుతూ ఒక అయిదు నిమిషాలసేపు స్టవ్ మీద ఉంచి పప్పు పాకంలో బాగా ఉడకనివ్వాలి. స్టవ్ ఆఫ్ చేసుకోవాలి. ఒక చిన్న మూకుడు తీసుకుని రెండు చెంచాల నెయ్యిలో జీడిపప్పు, బాదం

పప్పు, కిస్మిస్ వేయించి పాయసంలో కలపాలి. నాలుగైదు ఏలకులను పొడి చేసి, పాయసంపైన చల్లాలి. అమ్మ వారి ప్రసాదం నివేదనకి తయార్! మరి అందరం అమ్మ వారిని భక్తి గా అర్చించుకుని, పాయసం నివేదించుకుని, శ్రీ బాలా త్రిపురసుందరీ అమ్మవారి అనుగ్రహానికి పాత్రులవుదాము!

ఇతర నివేదనలు: గోధుమ రవ్వ హల్వా

కొందరు, గోధుమ రవ్వ తో హల్వా చేసి కూడా ఈ రోజు నివేదన చేస్తారు.

కావసిన పదార్థములు :

గోధుమ రవ్వ ఒక గ్లాసు

బెల్లం కానీ, చెక్కర కానీ ఒక గ్లాసు

ఆవు పాలు : రెండు గ్లాసులు

ఆవు నెయ్యి : రెండు చెంచాలు

యాలకుల పొడి, కాసిని వేయించిన జీడి పప్పు అలంకరణ కోసం

తయారుచేసే విధానం:

పాలు పొయ్య మీద మరిగించి, దానిలో గోధుమ రవ్వ కలిపి సన్న సెగ మీద రవ్వను ఉడికించాలి. రవ్వ వుడికిన తరువాత, బెల్లం తురుము కాని, చెక్కెర కానీ వేసి బాగా కలపాలి. తీగ పాకం వచ్చాక నెయ్యి వెయ్యాలి. రవ్వ బాగా దగ్గర పడిన తరువాత శుభ్రమైన గిన్నెలోకి తీసుకుని, పైన యాలకులపొడి జల్లి, జీడి పప్పులు అద్దాలి. గోధుమ రవ్వ హల్వా తయార్!

## శ్రీ బాలా త్రిపురసుందరి అష్టోత్తర శతనామావళి

శరన్నవరాత్రి ఉత్సవములలో రెండొవ రోజు దుర్గమ్మ బాలత్రిపుర సుందరిగా దర్శనమిస్తుంది. త్రిపురిని భార్య త్రిపుర సుందరీ దేవి, అంటే ఈశ్వరుడి భార్య అయిన గౌరీదేవి అని అర్థము.ఓం ఐం హ్రీం శ్రీం బాలా త్రిపుర సుందర్యైనమోనమః అనే మంత్రాన్ని 108 మార్లు జపించాలి.

ఓం కళ్యాణ్యై నమః

ఓం త్రిపురాయై నమః

ఓం బాలాయై / మాయాయై నమః

ఓం త్రిపురసుందర్యై నమః

ఓం సుందర్యై నమః

ఓం సౌభాగ్యవత్యై నమః

ఓం క్లీంకార్యై నమః

ఓం సర్వమంగళాయై నమః

ఓం హ్రీంకార్యై నమః

ఓం స్కందజనన్యై నమః
ఓం పరాయై నమః
ఓం పంచదశాక్షర్యై నమః
ఓం త్రిలోక్యై నమః
ఓం మోహనాధీశాయై నమః
ఓం సర్వేశ్వర్యై నమః
ఓం సర్వరూపిణ్యై నమః
ఓం సర్వసంక్షభిణ్యై నమః
ఓం పూర్ణాయై నమః
ఓం నవముద్రేశ్వర్యై నమః
ఓం శివాయై నమః
ఓం అనంగకుసుమాయై నమః
ఓం ఖ్యాతాయై /అనంగాయై నమః
ఓం భువనేశ్వర్యై నమః
ఓం జప్యాయై నమః
ఓం స్వాయై / శ్రుత్యై నమః
ఓం నిత్యాయై నమః
ఓం నిత్యక్లిన్నాయై నమః
ఓం అమ ృతోద్భభవాయై నమః
ఓం మోహిన్యై నమః
ఓం పరమాయై నమః
ఓం ఆనందదాయై నమః
ఓం కామేశ్యై నమః
ఓం తరణాయై నమః
ఓం కళయై / కళవత్యై నమః
ఓం భగవత్యై నమః
ఓం పద్మరాగకిరీటన్యై నమః
ఓం సౌగంధన్యై నమః
ఓం సరిద్వేణ్యై నమః
ఓం మంత్రిణ్యై నమః
ఓం మంత్రరూపిణ్యై నమః
ఓం తత్త్వత్రయ్యై నమః
ఓం తత్త్వమయ్యై నమః
ఓం సిద్ధాయై నమః
ఓం త్రిపురవాసిన్యై నమః
ఓం శ్రియై /మత్యై నమః
ఓం మహాదేవ్యై నమః
ఓం కౌళిన్యై నమః
ఓం పరదేవతాయై నమః
ఓం కైవల్యరేఖాయై నమః
ఓం వశిన్యై / సర్వేశ్వర్యై నమః
ఓం సర్వమాత ృకాయై నమః
ఓం విష్ణుస్వశ్రేయసే నమః
ఓం దేవమాత్రే నమః
ఓం సర్వసంపత్ప్రదాయిన్యై నమః
ఓం కింకర్యై నమః
ఓం మాత్రే నమః
ఓం గీర్వాణ్యై నమః
ఓం సురాపానామోదిన్యై నమః
ఓం ఆధారాయై నమః
ఓం హితపత్నికాయై నమః
ఓం స్వాధిస్థానసమాశ్రయాయై నమః
ఓం అనాహతాబ్జనిలయాయై నమః
ఓం అజ్ఞాయై నమః
ఓం పద్మాసనాసీనాయై నమః
ఓం విశుద్ధస్థలసంస్థితాయై నమః
ఓం అష్టత్రింశత్కళామూర్త్యై నమః
ఓం సుషుమ్నాయై నమః

ఓం చారుమధ్యాయై నమః
ఓం యోగేశ్వర్యై నమః
ఓం మునిధ్యేయాయై నమః
ఓం పరబ్రహ్మస్వరూపిణ్యై నమః
ఓం చతుర్భుజాయై నమః
ఓం చంద్రచూడాయై నమః
ఓం పురాణాగమరూపిణ్యై నమః
ఓం ఐంకారాదయే నమః
ఓం మహావిద్యాయై నమః
ఓం పంచప్రణవరూపిణ్యై నమః
ఓం భూతేశ్వర్యై నమః
ఓం భూతమయ్యై నమః
ఓం పంచాశద్వర్ణరూపిణ్యై నమః
ఓం షోడశన్యాసమహాభూషాయై నమః
ఓం కామాక్ష్యై నమః
ఓం దశమాత ృకాయై నమః
ఓం ఆధారశక్త్యై నమః
ఓం తరుణ్యై నమః
ఓం లక్ష్యై నమః
ఓం త్రిపురభైరవ్యై నమః
ఓం శాంభవ్యై నమః
ఓం సచ్చిదానందాయై నమః
ఓం సచ్చిదానందరూపిణ్యై నమః
ఓం మాంగళ్యదాయిన్యై నమః
ఓం మాన్యాయ్యై నమః
ఓం సర్వమంగళాకారిణ్యై నమః
ఓం యోగలక్ష్మ్యై నమః
ఓం భోగలక్ష్మ్యై నమః
ఓం రాజ్యలక్ష్మ్యై నమః
ఓం త్రికోణగాయై నమః
ఓం సర్వసౌభాగ్యసంపన్నాయై నమః
ఓం సర్వసంపత్తిదాయన్యై నమః
ఓం నవకోణపురావాసాయై నమః
ఓం బిందుత్రయసమన్వితాయై నమః

శ్రీ మహాకాళీ శ్రీ మహాలక్ష్మీ శ్రీ మహా సరస్వతీ స్వరూపిణీ శ్రీ దుర్గాంబికా పరదేవతాయై నమః
శ్రీ బాలా త్రిపురసుందరి అష్టోత్తర శతనామావళి పూజా సమర్పయామి

# శ్రీ గాయత్రీ దేవి

ముక్తా విద్రుమ హేమ నీల ధవళచ్ఛాయైర్ముఖై స్త్రీక్షణైః
యుక్తా మిందు నిబద్ధరత్నమకుటాం తత్త్వార్థవర్ణాత్మికామ్
గాయత్రీం వరదా భయం కుశకశాః శ్శుభ్రం కపాలం గదాం
శంఖం చక్ర మదారవింద యుగళం హస్తైర్వహంతీం భజే ॥

# 3.తృతీయం చతుర్వేద స్వరూపం! శ్రీ గాయత్రీ దేవి అలంకారం

దేవీ నవరాత్రులలో ఆశ్వయుజ శుక్ల తదియ నాడు కదంబవనవాసిని అయిన ఆ పరమేశ్వరిని శ్రీ గాయత్రీ దేవి అలంకారంలో పూజించుకుంటారు భక్తులు. మరి మనమందరం భక్తితో అమ్మను ధ్యానించుకుని, ఆ సర్వ మంగళ స్వరూపాన్ని మనస్సులో ప్రతిష్టించుకుందాం. చతుర్వేద స్వరూపమైన శ్రీ గాయత్రీ దేవి తేజోవంతమైన అయిదు ముఖాలతో జ్ఞాన జ్యోతులను వెదజల్లుతూ వుంటుంది. శంఖం, చక్రం, గద, అంకుశం ధరించి, శోభనమూర్తిగా కొలువై ఉంటుంది. ఆదిశంకరులు ఆరాధించిన ఈ గాయత్రీ దేవిని వీక్షించిన మాత్రాన మనసు పులకితమౌతుంది. దైవ శక్తులకే మూలాధారం శ్రీ గాయత్రీ మాత!

'ఓం భూర్భువస్వః తత్సవితుర్వరేణ్యం భర్గో దేవస్య ధీ మహీ థియో యోనః ప్రచోదయాత్!'

అని భక్తితో ఉచ్చరించినంతనే ఉపాసనాబుద్ధి తేజోవంతం అవుతుంది. ఈ గాయత్రీ దేవి అలంకారం లో అమ్మ వారిని ఆరాధిస్తే చతుర్వేద పారాయణ ఫలితం కలిగి, సకల దురిత ఉపద్రవాలు పటాపంచలు అవుతాయి. పంచముఖాలు కలిగిన ఈ మాత పంచభూతాలకు ప్రతీక. విశ్వ క్షేమానికై గాయత్రీ దేవి అర్చన అత్యంత ఆవశ్యకం! అందుచేతనే ఈ శరన్నవరాత్రులలో గాయత్రీ దేవిఉపాసన విశిష్ఠంగా పొందుపరిచారు దైవజ్ఞులు! శ్రీ గాయత్రీ దేవి అష్టోత్తరంతో అమ్మ వారికి షోడశోపచార పూజ గావించి, వీలైనన్ని సార్లు గాయత్రీ మంత్రాన్ని పఠించి, అమ్మకి వడపప్పు, పానకం, పచ్చి చలిమిడితో పాటు అల్లపు గారెలు నివేదన చేస్తే అమ్మవారు మనలను చల్లగా కాపాడుతారు.

ఈ నాడు ధరించవలసిన వర్ణం: కనకాంబరం

ఈ నాటి నివేదన: అల్లపు గారెలు

తయారుచేసే విధానం:

పండగ రోజు ఉదయాన్నే లేచి, స్నానం చేసిన తర్వాత రెండు గ్లాసుల ఛాయ మినప్పప్పు, ఒక అరగ్లాసు పొట్టుమినప్పప్పు నాన బెట్టుకోవాలి. పప్పు చక్కగా నానిన తరువాత, నీళ్ళు తక్కువగా పోస్తూ తగినంత ఉప్పు వేసి మెత్తగా, గట్టిగా రుబ్బుకోవాలి. పప్పుకి సరి పడా పచ్చిమిరపకాయలు, చిన్న అల్లం ముక్క తీసుకుని, శుభ్రం చేసి, మిక్సీ లో వేసి, మెత్తగా రుబ్బుకోవాలి. ఈ అల్లం పచ్చిమిరపకాయ ముద్దను పిండిలో బాగా కలిసేలా కలుపుకోవాలి. ఒక మూకుడును స్టవ్ మీద పెట్టి, గారెలు వేయించడానికి సరిపడా నూనె కాని ఇష్టమైన వారు నెయ్యి కానీ పోసి, బాగా కాగాక ఒక అరటి ఆకు ముక్క కాని ప్లాస్టిక్ కవర్ కాని తీసుకుని, పిండిని మధ్యలో చిల్లు పెట్టి గారెల ఆకారంలో వేసి, రెండు పక్కలా బాగా వేయించుకోవాలి. వేగిన గారెలను నూనె లేకుండా తీసి, అర్చనానంతరం అమ్మవారికి భక్తిగా నివేదన చేసుకోండి.

ఇతర నివేదనలు: వడపప్పు:

ఒక అరగ్లాసుడు చాయ పెసరపప్పును ఒక గ్లాస్ నీళ్ళలో ఒక అరగంట సేపు నాన బెట్టి, నీళ్లు ఒడ్చేస్తే వడపప్పు సిద్ధం. కొంచెం వెరైటీ గా కావాలనుకునే వాళ్ళు నానిన పప్పు లో కొంచెం నిమ్మరసం పిండి, తగినంత ఉప్పు వేసి, పచ్చి కొబ్బరి తురుముగా కాని చిన్న చిన్న ముక్కలుగా కాని కలుపుకోవచ్చు.

పానకం:

రెండు గ్లాసుల నీళ్ళను ఒక గిన్నెలో పోసి దానికి సరి పడా అంటే రెండు గ్లాసుల బెల్లం పొడిని తీసుకుని నీళ్ళల్లో బాగా కలిసేలా కలుపుకోవాలి. ఒక అర చెంచాడు మిరియాలు పొడి చేసి బెల్లం కరిగిన నీళ్ళల్లో కలుపుకోవాలి .అమ్మ వారికి అత్యంత ప్రీతికరమైన పానకం సిద్ధమైపోయింది.

నువ్వుపిండి పులిహోర:

పులిహోరకు కావాల్సిన అన్నం కాస్త బిరుసుగా వండాలి. ఒక కప్పులో తగినంత చింతపండు నాన బెట్టి, మెత్తగా గుజ్జు తీసి పొయ్యిమీద మూకుడులో పది నిముషాలు ఉడకబెట్టాలి. దీనిలో నిలువుగా చీల్చిన పచ్చిమిర్చి తగినన్ని వేసుకుని ఉడకనివ్వాలి. గుజ్జు తడి ఇగిరి గట్టి పడాలి. ఇక ఒక మూకుడులో తగినంత నూనె వేసి, కాగాక, మినపప్పు, సెనగ పప్పు, ఆవాలు, నాలుగైదు ఎండు మిరపకాయలు, కరివేపాకు రెబ్బలు, చిటికెడు ఇంగువ వేసి పోపు వేయించుకోవాలి. ఇపుడు ఒక పెద్ద పళ్ళెం తీసుకుని, ఉడికిన అన్నం పరిచి, దానిలో ఉడికిన చింతపండు గుజ్జు, పసుపు, కొద్దిగా నూనె వేసి బాగా కలపాలి. తగినంత ఉప్పు చల్లి, వేయించిన పోపు కూడా వేసి చక్కగా కలపాలి. ఇప్పుడు ఒక మూకుడులో 50 గ్రాముల తెల్ల నువ్వులు దోరగా వేయించి, చల్లారాక మిక్సీలో పొడి చేసి, ఆ పొడిని పులిహెూర పైన చల్లి చక్కగా కలపాలి. ఇప్పుడు నువ్వుపిండి పులిహెూర తయార్! ఇక పచ్చి చలిమిడి ఎలా చేయాలో మీరిదివరకే నేర్చుకున్నారు కదా? ఒక్కసారి గుర్తు తెచ్చుకుని చేసుకుని, అమ్మవారికి నివేదించుకోండి.

## శ్రీ గాయత్రి అష్టోత్తర శతనామావళి

శరన్నవరాత్రులలో మూడవ రోజు అమ్మ గాయత్రీదేవిగా దర్శనమిస్తుంది.
సకల వేద స్వరూపం గాయత్రీ దేవి. అన్ని మంత్రాలకు మూలశక్తి గాయత్రీ దేవి. ముక్త, విద్రుమ, హేమ, నీల, ధవళ వర్ణాలు కలిగిన ఐదు ముఖాలతో శంఖం, చక్ర, గద, అంకుశం ధరించి దర్శనమిస్తుంది. ఆది శంకరులు గాయత్రీదేవిని అనంత శక్తి స్వరూపముగా అర్చించారు.

ఓం శ్రీ గాయత్త్రై నమః
ఓం జగన్మాత్రే నమః
ఓం పరబ్రహ్మస్వరూపిణే నమః
పరమార్థప్రదాయై నమః
ఓం జప్యాయై నమః
ఓం బ్రహ్మతేజో నమః
ఓం బ్రహ్మస్తరూపిణ్యై నమః
ఓం భవ్యాయై నమః
ఓం త్రికాలధ్యేయరూపిణ్యై నమః
ఓం త్రిమూర్తిరూపాయై నమః
ఓం సర్వజ్ఞాయై నమః
ఓం వేదమాతాయై నమః
ఓం మనోన్మవ్యై నమః
ఓం బాలికాయై / వృద్ధాయై నమః
సూర్యమండలవసిన్యై నమః
ఓం మందేహదానవధ్వంసకారిణ్యై నమః
ఓం సర్వకారణాయై నమః
ఓం హంసరూఢాయై నమః
ఓం వృషారూఢాయై నమః
ఓం గరుడారోహిణ్యై నమః
ఓం శుభాయై / షట్కుక్షిణ్యై నమః
ఓం త్రిపదాయై / శుద్ధాయై నమః
ఓం పంచశీర్షాయై నమః
ఓం త్రిలోచనాయై నమః
ఓం త్రివేదరూపాయై నమః
ఓం త్రివిధాయై నమః
ఓం త్రివర్గఫలదాయిన్యై నమః
ఓం దశహస్తాయై నమః
ఓం చంద్రవర్ణాయై నమః
ఓం విశ్వామిత్రవరప్రదాయై నమః
ఓం దశాయుధధరాయై నమః
ఓం నిత్యాయై నమః
ఓం సంతుష్టాయై నమః
ఓం బ్రహ్మపూజితాయై నమః
ఓం ఆదిశక్త్యై నమః
ఓం మహావిద్యాయై నమః
ఓం సుషుమ్నాభాయై నమః
ఓం సరస్వత్యై నమః
ఓం చతుర్వింశత్యక్షరాఢ్యాయై నమః
ఓం సావిత్ర్యై నమః
ఓం సత్యవత్సలాయై నమః
ఓం సంధ్యాయై / రాత్ర్యై నమః
ఓం సంధ్యారాత్రి ప్రభాతఖాయై నమః
ఓం సంఖ్యాయనకులోద్భవాయై నమః
ఓం సర్వేశ్వర్యై నమః
ఓం సర్వవిద్యాయై నమః
ఓం సర్వమంత్రాద్యై నమః
ఓం అవ్యయాయై నమః
ఓం శుద్ధవస్త్రాయై నమః
ఓం శుద్ధవిద్యాయై నమః
ఓం శుక్లమాల్యానులేపనాయై నమః
ఓం సురసింధుసమాయై నమః
ఓం సౌమ్యాయై నమః
ఓం బ్రహ్మలోకనివాసిన్యై నమః
ఓం ప్రణవప్రతిపాద్యర్థాయై నమః
ఓం ప్రణతోద్ధరణక్షమాయై నమః
ఓం జలాంజలిసుసంతుష్టాయై నమః
ఓం జలగర్భాయై నమః

ఓం జలప్రియాయై నమః
ఓం స్వాహాయై / స్వధాయై నమః
ఓం సుధాసంస్థాయై నమః
ఓం శ్రౌషడ్వౌషటడ్వషట్క్రియాయై నమః
ఓం సురభ్యై నమః
ఓం షోడశకలాయై నమః
ఓం మునిబృందనిషేవితాయై నమః
ఓం యజ్ఞప్రియాయ నమః
ఓం యజ్ఞమూర్త్యై నమః
ఓం స్రుక్ స్రువాజ్యస్వరూపిణ్యై నమః
ఓం అక్షమాలాధరయై నమః
ఓం అక్షమాలాసంస్థాయై నమః
ఓం అక్షరాకృత్యై నమః
ఓం మధుచ్ఛందదఋషిప్రీతాయై నమః
ఓం స్వచ్ఛందాయై నమః
ఓం చందసాంనిద్యై నమః
ఓం అంగుళీపర్వసంస్థాయై నమః
ఓం చతుర్వింశతిముద్రికాయై నమః
ఓం బ్రహ్మమూర్త్యై నమః
ఓం రుద్రశిఖాయై నమః
ఓం సహస్రపరమాయై నమః
ఓం అంబికాయై నమః

ఓం విష్ణుహృదయాయై నమః
ఓం అగ్నిముఖాయై నమః
ఓం శతమాధ్యాయై నమః
ఓం శతవరాయై నమః
ఓం సహస్రదళపద్మస్థాయై నమః
ఓం హంసరూపాయై నమః
ఓం నిరంజనాయై నమః
ఓం చరాచరస్థాయై నమః
ఓం చతురాయై నమః
ఓం సూర్యకోటిసమప్రభాయై నమః
ఓం పంచవర్ణముఖీయై నమః
ఓం ధాత్రీయై నమః
ఓం చంద్రకోటిశుచిస్మితాయై నమః
ఓం మహామాయాయై నమః
ఓం విచిత్రాంగ్యై నమః
ఓం మాయాబీజనివాసిన్యై నమః
ఓం సర్వయంత్రాత్మికాయై నమః
ఓం జగద్ధితాయై / రాత్ర్యై నమః
ఓం మర్యాదాపాలికాయై నమః
ఓం మాన్యాయై నమః
ఓం మహామంత్రఫలప్రదాయై నమః
ఓం సర్వతంత్రస్వరూపాయై నమః

శ్రీ మహాకాళీ శ్రీ మహాలక్ష్మీ శ్రీ మహా సరస్వతీ స్వరూపిణీ శ్రీ దుర్గాంబికా పరదేవతాయై నమః
శ్రీ గాయత్రీ అష్టోత్తర శతనామావళి పూజా సమర్పయామి

# శ్రీ అన్నపూర్ణా దేవి



నిత్యానందకరీ పరాభయకరీ సౌందర్య రత్నాకరీ ।
నిర్ధూతాఖిల లోకపావనకరీ ప్రత్యక్ష మాహేశ్వరీ ।
ప్రాలేయాచల వంశపావనకరీ కాశీపురాధీశ్వరీ ।
భిక్షాం దేహి! కృపావలంబనకరీ! మాతాన్నపూర్ణేశ్వరీ ॥

# 4.చతుర్థం-అన్నస్వరూపం! శ్రీ అన్నపూర్ణాదేవి అలంకారం

దేవీ నవరాత్రులలో నాలుగవ నాడు అమ్మ వారు శ్రీ అన్నపూర్ణాదేవి అలంకారంలో అలరారుతారు. 'భిక్షాందేహి కృపావలంబన కరీ, మాతాన్నపూర్ణే శ్వరీ!' అని ప్రార్థిస్తూ,ఈ రోజున ఆది పరాశక్తిని శ్రీ అన్నపూర్ణాదేవి గా అలంకరించి, ఆరాధిస్తారు.

అన్నం పరబ్రహ్మ స్వరూపం. సాక్షాత్ అన్నపూర్ణాదేవి కటాక్షం. ఆ పరమాత్మే ఆది భిక్షువుగా బిక్షను స్వీకరించినట్లుగా మనకు అనేక పురాణ గాథల ద్వారా తెలుస్తోంది. అన్నం ప్రతి జీవిలోనూ ప్రాణశక్తికి ఆధారం. అందుకే మనం భోజనం చేసే ముందు, ప్రతిసారి అన్నం ఆ భగవంతుని ప్రసాదంగా భావించి కృతజ్ఞతలు తెలుపుకుంటే ఎంతో తృప్తిగా దానిని స్వీకరించగలుగుతాము. సాధారణంగా ఎవరికైనా కడుపునిండా భోజనం పెడితే ఆ వ్యక్తి చాల సంతోషంతో "ఆకలిగా ఉన్ననాకు సాక్షాత్తు అన్నపూర్ణ లాగా అన్నం పెట్టావు తల్లీ" అని అనటం వింటూ ఉంటాము. ఆ మాట అక్షరాలా నిజం కూడా. భోజనం పరమ ఆపేక్షతో పెట్టిన వారందరూ అన్నపూర్ణలే! ఇంటికి వచ్చిన అతిధులకు కానీయండి, ఇంటిలోని వారికే కానీయండి, ఎవరికైనా అన్నం వడ్డన చేసేటపుడు వడ్డన చేసే ఆ వ్యక్తి కళ్ళలోని ఆప్యాయతే అన్నపూర్ణతత్వాన్ని తెలియచేస్తుంది. భోజనం చేసిన వారి కళ్ళలోని తృప్తిని చూసి మురిసే సంతోషమే అన్నపూర్ణ. అందుకే అన్నపూర్ణ తత్వాన్ని ఏ గొప్ప చిత్రకారుడు కాని, ఏ గొప్ప శిల్పి కాని చూపించటం అన్నది సాధ్యం కాదు అని చెప్పటమే సబబు అనిపిస్తుంది.

జీవకోటికి ప్రాణాధారం అయిన అన్నం ఈమె అధీనం! పరమేశ్వరునికే బిక్ష వేసి ఆది బిక్షువుని చేసింది కనుక, మనమందరం ఈ రోజున వామ హస్తమున అక్షయమైన అన్న పాత్ర, దక్షిణ హస్తమున ఒక గరిటతో భక్తులకు ప్రసాదిస్తున్న మాతను మనో నేత్రంతో దర్శించుకుంటూ అన్నపూర్ణా అష్టోత్తరనామాలతో అమ్మవారిని పూజించుకుని, పునీతులమవుదాము. ఈ రోజునే తల్లులందరూ 'స్తనవృద్ధి గౌరీ వ్రతం' అని కూడా జరుపుకుంటారు. తల్లులు తమ సంతానానికి తల్లిపాలకి లోటు రాకుండా అమ్మవారు అనుగ్రహిస్తుందని అపారమైన నమ్మకంతో ఈ వ్రతం ఆచరిస్తూ, జగన్మాతను అన్నపూర్ణా దేవిగా కొలుస్తారు.

మనమందరమూ కూడా దేవీ నవరాత్రులలో రేపటి రోజున శ్రీ శాంకరిని అన్నపూర్ణాదేవి అలంకారంలో ఆరాధించి, ఆమెను ప్రసన్నం చేసుకుని, తరిద్దాము. అన్నపూర్ణ అష్టోత్తర నామాలు భక్తిగా ఉచ్చరిస్తూ, అన్నపూర్ణ స్తోత్రం పారాయణం చేసుకుంటూ, సమస్త ఉపచారాలు చేసి, దద్దోజనాన్ని, కట్టె పొంగలిని నివేదిద్దాము.

ఈ నాడు ధరించవలసిన వర్ణం: గంధం రంగు

ఈ నాటి నివేదనలు: దధ్యోదనం (దద్దోజనం అంటారు అందరూ. కానీ అలా అనకూడాదు. దధ్యోదనం అనాలి) మరియు కట్టెపొంగలి

### దధ్యోదనం:

ముందుగా ఒక గ్లాస్ బియ్యం మెత్తగా ఉడకబెట్టుకుని, అన్నాన్ని చల్లారబెట్టుకోవాలి. రెండు పచ్చిమిరపకాయలు, చిన్న అల్లం ముక్క తీసుకుని సన్నగా తరిగిపెట్టుకోవాలి. పోపుగరిట స్టవ్ మీద పెట్టి ఒక చెంచాడు నెయ్యి వెయ్యండి. వేడెక్కాక రెండు ఎండుమిరపకాయ ముక్కలు, ఒక అరచెంచాడు మినప్పప్పు, సరిపడా జీడిపప్పు పలుకులు, కాసిని మెంతిగింజలు, ఒక పావు చెంచాడు ఆవాలు, ఒక అరచెంచాడు జీలకర్ర వేసి పోపు వేయించుకోవాలి. పోపు వేగాక తరిగి ఉంచుకున్న పచ్చిమిరపకాయ ముక్కలు, అల్లం ముక్కలు, కరివేపాకు రెండు రెబ్బలు వేసి ఒక నిమిషం పాటు వేగనివ్వాలి. ఇలా వేయించుకున్న పోపు చల్లార్చుకున్న అన్నంలో వేసి, తగినంత ఉప్పు జోడించి, కలిసేలా బాగా కలుపుకోవాలి. ఇప్పుడు ఈ అన్నానికి సరిపడా పెరుగు వేసి కలిసేలా కలుపుకోవాలి. 'దధ్యన్నాసక్తహృదయ' కి దధ్యోదనం తయార్!

### కట్టెపొంగలి:

రెండు గ్లాసుల బియ్యం, ఒక గ్లాస్ పెసరపప్పు కలిపి, కొంచెం మెత్తగానే ఉడక బెట్టుకోవాలి. నాలుగు పచ్చిమిరపకాయలు, కొంచెం అల్లం సన్నగా తరిగి పెట్టుకోవాలి. ఒక కరివేపాకు రెమ్మ ఆకులు తీసి పెట్టుకోవాలి. ఒక చిన్న మూకుడు స్టవ్ మీద పెట్టి, మూడు చెంచాల నెయ్యి వెయ్యాలి. వేడెక్కాక రెండు ఎండు మిరపకాయ ముక్కలు, రెండు చెంచాల మినప్పప్పు, రెండు చెంచాల జీడిపప్పు, ఒక అరచెంచాడు ఆవాలు, ఒక చెంచాడు జీలకర్రవేసి చివరలో ఒక పావు చెంచాడు మిరియాలు వేసి మూత పెట్టాలి. లేకపోతే మిరియాలు పేలి మొహం మీద పడే ప్రమాదం ఉంది, మిరియాల చిటపట వినిపించేక మూత తీసి అల్లం పచ్చి మిరపకాయ ముక్కలు, కరివేపాకు వేసి, వాటి పచ్చివాసన పోయేదాకా వేయించి స్టవ్ మీద నుండి దింపుకోవాలి. ఇప్పుడ ఈ పోపును తగినంత ఉప్పును తీసుకుని, ఉడక బెట్టి ఉంచుకున్న అన్నం, పెసరపప్పులో బాగా కలిసేలా కలుపుకోవాలి. నెయ్యి కొంచెం ఎక్కువగా ఇష్టపడే వాళ్ళు పొంగలి పైన రెండు మూడు స్పూన్స్ నెయ్యి వేసుకోవచ్చు. ఇప్పుడు కట్టెపొంగలి తయార్!

### ఇతర నివేదనలు: మిరియాల గారెలు:

ఈ రోజు మిరియాల గారెలు కూడా నివేదించటం కద్దు. పొట్టు మినప పప్పు నానబెట్టి, సగం పొట్టు తీసివేసి, పప్పును మెత్తగా రుబ్బుకుని, అల్లం పచ్చి మిర్చి ముక్కలు, తగినన్ని మిరియాలు, పిండిలో కలుపుకుని, మూకుడులో తగినంత నూనె పోసి, కాగేక, పిండిని గారెలుగా వేసుకోవాలి. ఎర్రగా వేగాక నూనె ఒడ్చి పాత్రలోకి తీసుకోవాలి. ఇప్పుడు నివేదనకు మిరియాల గారెలు కూడా తయార్! ఈ రోజు నివేదనకు దద్ధోజనం, కట్టెపొంగలి, మిరియాల గారెలు సిద్ధం చేసుకున్నాం కదా? మరి అమ్మ వారి అర్చన కూడా శ్రద్ధగా శక్తి కొలది చేసుకుని, అమ్మవారి ఆశీస్సులందుకుందాము.

## శ్రీ అన్నపూర్ణా అష్టోత్తర శతనామావళి

సకల ప్రాణకోటికి జీవనాధారము అన్నము. దసరా ఉత్సవాలలో 4 రోజు అమ్మవారిని శ్రీఅన్నపూర్ణాదేవిగా అలంకరిస్తారు. అమ్మ ధరించిన రసపాత్ర అక్షయ శుభాలను అందిస్తుంది. బుద్ధిజ్ఞానాలను ఈ తల్లి వరములుగా ఇస్తుంది. పరిపూర్ణ భక్తితో తనను కొలిచే భక్తుల పోషణాభారము అమ్మ వహిస్తుందని ఆర్షవాక్యము.

ఓం అన్నపూర్ణాయై నమః
ఓం శివాయై నమః
ఓం దేవ్యై నమః
ఓం భీమాయై నమః
ఓం పుష్ట్యై నమః
ఓం సరస్వత్యై నమః
ఓం సర్వజ్ఞాయై నమః
ఓం పార్వత్యై నమః
ఓం దుర్గాయై నమః
ఓం శర్వాణ్యై నమః
ఓం శివవల్లభాయై నమః
ఓం వేదవేద్యాయై నమః
ఓం మహావిద్యాయై నమః
ఓం విద్యాదాత్ర్యై నమః
ఓం విశారదాయై నమః
ఓం కుమార్యై నమః
ఓం త్రిపురాయై నమః
ఓం లక్ష్మ్యై నమః
ఓం భయహారిణ్యై నమః
ఓం భవాన్యై నమః
ఓం విష్ణుజనన్యై నమః
ఓం బ్రహ్మాదిజనన్యై నమః
ఓం గణేశ జనన్యై నమః
ఓం శక్త్యై నమః
ఓం కౌమారజనన్యై నమః
ఓం శుభాయై నమః
ఓం భోగప్రదాయై నమః
ఓం భగవత్యై నమః
ఓం భక్తాభీష్టప్రదాయిన్యై నమః
ఓం భవరోగహరాయై నమః
ఓం భవ్యాయై నమః
ఓంశుభ్రాయై నమః
ఓం పరమమంగళాయై నమః
ఓం భవాన్యై నమః
ఓం చంచలాయై నమః
ఓం గౌర్యై నమః
ఓం చారుచంద్రకళాధరాయై నమః
ఓం విశాలక్ష్యై నమః
ఓం విశ్వమాత్రే నమః
ఓం విశ్వవంద్యాయై నమః
ఓం విలాసిన్యై నమః
ఓం ఆర్యాయై నమః
ఓం కల్యాణ నిలయాయై నమః
ఓం రుద్రాణ్యై కమలాసనాయై నమః
ఓం శుభప్రదాయై నమః
ఓం శుభాయై నమః
ఓం అనంతాయై నమః
ఓం మత్తపీనపయోధరాయై నమః
ఓం అంబాయై నమః
ఓం సంహారమథన్యై నమః
ఓం మృడాన్యై నమః
ఓం సర్వమంగళాయై నమః

ఓం విష్ణు సేవితాయై నమః
ఓం సిద్ధాయై నమః
ఓం బ్రహ్మణ్యై నమః
ఓం సురసేవితాయై నమః
ఓం పరమానందాయై నమః
ఓం శాంత్యై నమః
ఓం పరమానందరూపిణ్యై నమః
ఓం పరమానంద జనన్యై నమః
ఓం పరానంద ప్రదాయిన్యై నమః
ఓం పరోపకార నిరతాయై నమః
ఓం పరమాయై నమః
ఓం భక్తవత్సలాయై నమః
ఓం పూర్ణచంద్రాబ్భవదనాయై నమః
ఓం పూర్ణచందనిభాంశుకాయై నమః
ఓం శుభలక్షణ సంపన్నాయై నమః
ఓం శుభానంద గుణార్ణవాయై నమః
ఓం శుభసౌభాగ్యనిలయాయై నమః
ఓం శుభదాయై నమః
ఓం రతిప్రియాయై నమః
ఓం చండికాయై నమః
ఓం చండమదనాయై నమః
ఓం చండదర్పనివారిణ్యై నమః
ఓం మార్తాండనయనాయై నమః
ఓం సాధ్వ్యై నమః
ఓం చంద్రాగ్నినయనాయై నమః
ఓం సత్యై నమః
ఓం పుండరీకహరాయై నమః
ఓం పూర్ణాయై నమః
ఓం పుణ్యదాయై నమః
ఓం పుణ్యరూపిణ్యై నమః
ఓం మాయాతీతాయై నమః
ఓం శ్రేష్ఠమాయాయై నమః
ఓం శ్రేష్ఠధర్మాత్మవందితాయై నమః
ఓం అసృష్ట్యై నమః
ఓం సంగరహితాయై నమః
ఓం సృష్టిహేతుకవర్ధిన్యై నమః
ఓం వృషారూఢాయై నమః
ఓం శూలహస్తాయై నమః
ఓం స్థితి సంహార కారిణ్యై నమః
ఓం మందస్మితాయై నమః
ఓం స్కందమాత్రే నమః
ఓం శుద్ధచిత్తాయై నమః
ఓం మునిస్తుత్యాయై నమః
ఓం మహాభగవత్యై నమః
ఓం దక్షాయై నమః
ఓం దక్షాధ్వరవినాశిన్యై నమః
ఓం సర్వార్థ దాత్ర్యై నమః
ఓం సావిత్ర్యై నమః
ఓం సదాశివకుటింబిన్యై నమః
ఓం నిత్యసుందరస్త్వాంగై నమః
ఓం సచ్చిదానంద లక్షణాయై నమః
ఓం సర్వదేవతా సంపూజ్యాయై నమః
ఓం శంకరప్రియవల్లభాయై నమః
ఓం సర్వధారాయై నమః
ఓం మహాసాధ్వ్యై నమః
ఓం శ్రీ అన్నపూర్ణాయై నమః

శ్రీ మహాకాళీ శ్రీ మహాలక్ష్మీ శ్రీ మహా సరస్వతీ స్వరూపిణీ శ్రీ దుర్గాంబికా పరదేవతాయై నమః
శ్రీ అన్నపూర్ణ అష్టోత్తర శతనామావళి పూజా సమర్పయామి

# శ్రీ లలితా త్రిపురసుందరీ దేవి



ప్రాత స్స్మరామి లలితా వదనారవిందం
బింబాధరం పృథుల మౌక్తిక శోభినాసమ్
ఆకర్ణ దీర్ఘనయనం మణికుండలాఢ్యం
మందస్మితం మృగమదోజ్జ్వల ఫాలదేశమ్ ॥

## 5. పంచమం పరమ పవిత్రం! శ్రీ లలితా త్రిపుర సుందరి అలంకారం

పంచమి తిథిరోజున మణిద్వీపవాసిని అయిన పరాంబికను శ్రీ లలితా త్రిపురసుందరీ దేవి రూపంలో పూజలు జరుపుతారు. 'త్రిపురత్రయం' లో రెండవ శక్తి స్వరూపిణి ఈ తల్లి. అందుకే శరన్నవరాత్రులలో వచ్చే పంచమిని 'లలిత పంచమి' అని కూడా అంటారు. చెరకుగడ, విల్లు, పాశము, అంకుశము ధరించి, లక్ష్మీదేవి, సరస్వతీదేవి కుడి ఎడమలు సేవలు అందిస్తుండగా శ్రీ లలితా పరాభట్టారిక భక్తుల ఇక్కట్లు తొలగించి, అష్టైశ్వర్యాలను ప్రసాదిస్తుంది. కన్యలు మంచి భర్త కొరకు, ముత్తైదువులు దీర్ఘ సుమంగళిగా అఖండ సౌభాగ్యం కొరకు ఈ నవరాత్రులలో అయిదవ రోజు 'ఉపాంగ లలితా వ్రతం' ఆచరిస్తారు.

అమ్మవారిని శ్రీ లలితా దేవి అలంకారంలో సహస్రనామ, అష్టోత్తర నామాలతో కుంకుమ పూజలు చేసి, ముత్తైదువలకు తాంబూలాలు ఇచ్చుకుంటారు. ముత్తైదువులను పిలిచి, సువాసినీ పూజలు చేస్తారు. కైలాస గౌరీ నోము కాని గ్రామ కుంకుమ నోముకాని నోచుకున్న వారు చాలా మంది ఈ రోజు ఉద్యాపన చేసుకుంటారు. కొంతమంది తమ గృహాల్లోనే సామూహిక లక్ష కుంకుమార్చనలు ఏర్పాటు చేసుకుంటారు. బొమ్మల కొలువులు పెట్టుకున్న వారు పేరంటాలు చేసుకుంటారు. శ్రీ లలితా దేవి తనని కొలిచిన భక్తుల దారిద్ర దుఃఖాలు నశింపచేస్తుంది. కుంకుమ పూజలు సలిపేవారికి మాంగళ్య సౌభాగ్యాన్ని ప్రసాదిస్తుంది. పంచమి నాడు శ్రీ లలితాదేవి దేదీప్యమైన మూర్తిని మనస్సులో ప్రతిష్టించుకుని, 'ఓం ఐం హ్రీం శ్రీం శ్రీ మాత్రేనమః' అని వీలైనన్ని సార్లు జపించుకుంటే అమ్మ మాతృమూర్తి యై చల్లగా చూస్తుంది.

ఈనాడు ధరించవలసిన వర్ణం: బంగారు రంగు

ఈనాటి నివేదనలు: పులిహోర, పెసర బూరెలు

పులిహోర:

మనకు కావలిసిన పరిమాణం బట్టి బియ్యం తీసుకోవచ్చు. మనం ఇప్పుడు ఒక కిలో బియ్యంతో చేద్దాము. ఒక కిలో బియ్యం శుభ్రంగా కడిగి రెట్టింపు నీళ్లు కన్నా కొంచెం తక్కువగా పోసుకుని కొంచెం బిరుసుగానే అన్నం వండుకోవాలి. పులిహోరకి అన్నం మెత్తనైతే బాగుండదు. అన్నం వుడికే లోపు ఒక వంద గ్రాముల చింతపండు శుభ్రం చేసుకుని ఒక అరగ్లాస్ నీళ్ళల్లో నానబెట్టండి. నానాక గుజ్జు తీసుకుని, అందులో ఉసిరికాయంత బెల్లం వేసి ఒక అయిదు నిమిషాల సేపు ఉడికించి పక్కన పెట్టుకోండి. ఇక పులిహోర పోపుకు కావలిసిన ఈ క్రింది దినుసులు రెడీ చేసుకుందాము.

ఎండు మిరపకాయలు-5, జీడిపప్పులు-ఒక గుప్పెడు, వేరుశనగ పప్పులు- ఒక గుప్పెడు, మినప్పప్పు- మూడు చెంచాలు, ఆవాలు-ఒక చెంచాడు, ఇంగువ-ఒక చిటికెడు, నూనె-సరిపడా, పచ్చి మిరపకాయలు-6 ముక్కలుగా తరిగి, కరివేపాకు- రెండు రెమ్మలు, మిరియాలు-నాలుగైదు

కచ్చాపచ్చాగా పగలగొట్టి, పసుపు-కావలిసిన రంగు రావడానికి సుమారుగా ఒక అర చెంచాడు. ఉడికిన అన్నం ఒక పెద్ద బేసిన్‌లో కాని, పళ్ళెంలో కాని వేసి ఆరబెట్టుకోవాలి. ఒక మూకుడులో తగినంత నూనె పోసి, వేడెక్కాక పైన చెప్పిన దినుసులతో పోపు వేయించుకుని, వేగిన తర్వాత కిందకు దింపి, తర్వాత పసుపు వేస్తె పచ్చివాసన లేకుండా అన్నానికి పసుపు బాగా పడుతుంది. వేగిన పోపు, తగినంత ఉప్పు ఆరబెట్టుకున్న అన్నంలో కలిపి, ఉడికించి పెట్టుకున్న చింతపండు గుజ్జును కూడా వేసి బాగా కలిసేలా కలుపుకోవాలి. కొంతమంది పచ్చిమిరపకాయ కారం బాగా కావాలనుకునే వాళ్ళు పచ్చిమిరపకాయ ముక్కలను చింతపండు గుజ్జులో వేసి వుడకబెట్టుకోవచ్చు. ఇవి పులిహోర తినేటప్పుడు కొరుక్కు తింటే పుల్లపుల్లగా కారంకారంగా చాలా బాగుంటాయి. అమ్మవారికి నివేదన చేసేటప్పుడు ఒక నేతి గరిటెడు నెయ్యి అభికరించడం మర్చిపోకండే? దైవ నివేదనకి చేసిన ప్రతి వంటకంలో నెయ్యి అభికరించాక నివేదన చేయాలి అని పెద్దలు చెప్తారు. పులిహోర సిద్ధం అయింది. ఇక పెసర బూరెలు ఎలా చేయాలో చూద్దామా?

పెసరబూరెలు: కావలిసిన పదార్థాలు:

ఒక గ్లాస్ మినప్పప్పు, ఒక అరగ్లాస్ బియ్యం తోపు పిండికి బాగా నానేలా ముందుగా నాన బెట్టుకోవాలి. రెండు గ్లాసుల చాయ పెసర పప్పు విడిగా ఒక గంట ముందు నాన బెట్టుకోవాలి.

బెల్లం పొడి- రెండు గ్లాసులు, యాలకులు-6, నూనె బూరెలు వేయించడానికి సరిపడా.

ముందుగా నానిన పెసరపప్పుని మెత్తగా ఇడ్లి పిండిలా రుబ్బుకోవాలి. ఇడ్లీ కుక్కర్లో ఇడ్లీల్లా వేసి, ఉడికాక చల్లారనివ్వాలి. ఈ లోగా నానిన మినప్పప్పు, బియ్యం గ్రైండర్‌లో వేసి మెత్తగా రుబ్బి జాలువారుగా తోపు పిండి తయారు చేసుకోవాలి. బెల్లం పొడి మునగడానికి సరిపడా నీళ్లు పోసి స్టవ్ మీద పెట్టి పాకం తయారు చేస్తూ వుండాలి. పెసర ఇడ్లీలను ముక్కలుగా చేసి, మిక్సీ లో వేసి పొడి చేసుకోవాలి. దీనిని ఉడుకుతున్న బెల్లం పాకంలో వేసి, గట్టి పడేదాకా ఉడకనివ్వాలి. బాగా దగ్గర పడ్డాకా స్టవ్ ఆర్పేసి చల్లారనివ్వాలి. పైన యాలకుల పొడి కలపాలి. చల్లారాకా ఇక గట్టిపడి ఉండ చేసుకోవడానికి వీలుగా తయారు అవుతుంది. దానిని ఉండలుగా చేసి వుంచుకోవాలి. ఇప్పుడు స్టవ్ మీద మూకుడు పెట్టి, దాంట్లో బూరెలు వేయించుకోవడానికి సరిపడా నూనె పోసుకోవాలి. నూనె కాగాక మనం పూర్ణం బూరెలు వేసుకున్నట్లుగా ఉండలను ఒక్కోక్కటి తోపు పిండిలో ముంచి నూనె వేసి, బంగారు వర్ణం వచ్చేలాగా వేయించుకోవాలి. ఇడ్లీ పిండిని ఉండలుగా చేసుకునేటప్పుడు చేతికి నెయ్యి రాసుకుని చేస్తే ఉండలూ బాగా వస్తాయి. అమ్మ వారి బూరెలకు నేతి ఘుమఘుమ అంటుకుంటుంది.

శ్రీ లలితా పరభట్టారికా దేవికి వడపప్పు, పానకం, చలిమిడి తో పాటు ఈ పులిహోర, పెసరబూరెలు శ్రద్ధగా చేసి, భక్తిగా నివేదించుకుందాము.

## శ్రీ లలితా త్రిపుర సుందరి అష్టోత్తర శతనామావళి

దసరా నవరాత్రులలో 5వ రోజు అమ్మను శ్రీ లలితా త్రిపుర సుందరిగా అలంకరిస్తారు. త్రిపురాత్రయములో రెండొవ శక్తి లలితా అమ్మవారు. దేవీ ఉపాసకులకు అమ్మ ముఖ్య దేవత. త్రిగుణాతీతమైన కామేశ్వర స్వరూపము. పంచదశాక్షరీ మహామంత్ర అధిష్టాన దేవతగా లలితాత్రిపురసుందరీ దేవిని ఆరాధిస్తారు.

ఓం రజతాచలశృంగాగ్ర మధ్యస్థాయై నమః
ఓం హిమాచల మహావంశపావనాయై నమః
ఓం శంకార్ధాంగ సౌందర్య శరీరాయై నమః
ఓం లసన్మరకత స్వచ్ఛ విగ్రహాయై నమః
ఓం మహాతిశయ సౌందర్య లావణ్యాయై నమః
ఓం శశాంక శేఖర ప్రాణవల్లభాయై నమః
ఓం సదాపంచదశాత్మైక్య స్వరూపాయై నమః
ఓం వజ్రమాణిక్య కటకకిరీటాయై నమః
ఓం కస్తూరీతిలకోల్లాసి నిటలాయై నమః
ఓం భస్మరేఖాంకిత లసన్మస్తకాయై నమః
ఓం వికచాంభోరుహ ధళలోచనాయై నమః
ఓం శరచ్చాంపేయ పుష్పాభనాసికాయై నమః
ఓం లసత్కాంచనతాటంక యుగళాయై నమః
ఓం మణీదర్పణ సంకాశ కపోలాయై నమః
ఓం తాంబూలపూరితస్మేరవదనాయై నమః
ఓం సుపక్వదాడిమీబీజరదనాయై నమః
ఓం కంబుపూగసమచ్ఛాయ కన్ధరాయై నమః
ఓం స్థూలముక్తాఫలోదార సుహారాయై నమః
ఓం గిరీశబద్ధమాంగళ్య మంగళాయై నమః
ఓం పద్మపాశాంకుశలసత్కరాబ్జాయై నమః
ఓం పద్మకైరవమందార సుమాలిన్యై నమః
ఓం సువర్ణకుంభయుగ్మాభ సుకుచాయై నమః
ఓం రమణీయ చతుర్బాహు సంయుక్తాయై నమః
ఓం కన్కాంగదకేయూర భూషితాయై నమః
ఓం బృహత్సౌవర్ణ సౌందర్యవసనాయై నమః
ఓం బృహన్నితంబ విలసజ్జఘనాయై నమః
ఓం సౌభాగ్యజాత శృంగార మధ్యమాయై నమః
ఓం దివ్యభూషణ సందోహరంజితాయై నమః
ఓం పారిజాత గుణాధిక్య పదాబ్జాయై నమః
ఓం సుపద్మ రాగసంకాశ చరణాయై నమః
ఓం కామకోటి మహాపద్మ పీఠస్థాయై నమః
ఓం శ్రీకంఠనేత్రకుముద చంద్రికాయై నమః
ఓం సచామర రమావాణీ రజితాయై నమః
ఓం భక్తరక్షణ దాక్షిణ్య కటాక్షాయై నమః
ఓం భూతేశాలింగనోద్భూత పులకాంగ్యై నమః
ఓం అనంగజనకాపాంగవీక్షణాయై నమః
ఓం బ్రహ్మోపేంద్ర శిరోరత్నరంజితాయై నమః
ఓం శచీముఖ్యామరవధూ సేవితాయై నమః
ఓం లీలాకల్పితబ్రహ్మాండ మండలాయై నమః
ఓం అమృతాదిమహాశక్తిసంవృతాయై నమః
ఓం ఏకాతపత్రసామ్రాజ్యదాయికాయై నమః
ఓం సనకాది సమారాధ్య పాదుకాయై నమః
ఓం దేవర్షిభిస్స్తూయమానవైభవాయై నమః
ఓం కలశోద్భవ దుర్వాసః పూజితాయై నమః
ఓం మత్తేభవక్త్ర షడ్వక్త్రవత్సలాయై నమః
ఓం చక్రరాజ మహాయంత్ర మధ్యవర్తిన్యై నమః
ఓం చిదగ్నికుండ సంభూత సుదేహాయై నమః
ఓం శశాంకఖండ సంయుక్త మకుటాయై నమః
ఓం మత్తహంసవధూ మందగమనాయై నమః
ఓం వందారు జనసందోహ వందితాయై నమః
ఓం అంతర్ముఖ జనానంద ఫలదాయై నమః
ఓం పతివ్రతాంగనాభీష్ట ఫలదాయై నమః

ఓం అవ్యాజకరుణా పూరపూరితాయై నమః
ఓం నితాంత సచ్చిదానంద సంయుక్తాయై నమః
ఓం సహస్రసూర్య సంయుక్త ప్రకాశాయై నమః
ఓం రత్నచింతామణి గృహమధ్యస్థాయై నమః
ఓం హానివృద్ధి గుణాధిక్యరహితాయై నమః
ఓం మహాపద్మాటవీ మధ్య నివాసాయై నమః
ఓం జాగ్రత్ స్వప్న సుషుప్తీనాం సాక్షిభూత్యై నమః
ఓం మహాపాపౌఘ పాపానం వినాశిన్యై నమః
ఓం దుష్టభీతి మహాభీతి భంజనాయై నమః
ఓం సమస్తదేవదనుజప్రేరకాయై నమః
ఓం సమ్మ హృదయాంభోజ నిలయాయై నమః
ఓం అనాహత మహాపద్మ మందిరాయై నమః
ఓం సహస్రారసరోజాత వాసితాయై నమః
ఓం పునరావృత్తి రహిత పురస్థాయై నమః
ఓం వాణీగాయత్రీ సావిత్రీ సన్నుతాయై నమః
ఓం రమా భూమిసుతారాధ్య పదాబ్జాయై నమః
ఓం లోపాముద్రార్చిత శ్రీముచ్చరణాయై నమః
ఓం సహస్ర రతిసౌందర్య శరీరాయై నమః
ఓం భావనామాత్ర సంతుష్ట హృదయాయై నమః
ఓం సత్యసంపూర్ణ విజ్ఞాన సిద్ధిదాయై నమః
ఓం శ్రీలోచన కృతోల్లాస ఫలదాయై నమః
ఓం శ్రీసుధాబ్ధి మణిద్వీప మధ్యగాయై నమః
ఓం దక్షాధ్వర వినిర్భేదసాధనాయై నమః
ఓం శ్రీనాథ సోదరీభూత శోభితాయై నమః
ఓం చంద్రశేఖర భక్తార్తిభంజనాయై నమః
ఓం నామపారాయణ భీష్టఫలదాయై నమః
ఓం సృష్టిస్థితి తిరోధాన సంకల్పాయై నమః
ఓం శ్రీషోడశాక్షరీ మంత్రమధ్యగాయై నమః
ఓం అనాద్యంత స్వయంభూత దివ్యమూర్త్యై నమః
ఓం భక్తహంసపరాముఖ్య వియోగాయై నమః
ఓం మాతృమండల సంయుక్త లలితాయై నమః
ఓం భండదైత్య మహాసత్త్వ నాశనాయై నమః
ఓం క్రూరభండ శిరశ్చేద నిపుణాయై నమః
ఓం రక్షాక్షరరక్త జిహ్వాది శిక్షణాయై నమః
ఓం చండముండ నిశుంభాది ఖండనాయై నమః
ఓం ధాత్రచ్యుతసురాధీశసుఖదాయై నమః
ఓం మహిషాసురదోర్వీర్య నిగ్రహాయై నమః
ఓం అభ్రకేశమహోత్సవా కారణాయై నమః
ఓం మహేశయుక్త నటనా తత్పరాయై నమః
ఓం నిజభర్తృముఖాంభోజ చింతనాయై నమః
ఓం వృషభధ్వజ విజ్ఞానభావనాయై నమః
ఓం జన్మమృత్య జరారోగ భంజనాయై నమః
ఓం విధేయముక్త విజ్ఞానసిద్ధిదాయై నమః
ఓం కామక్రోధాది షడ్వర్గనాశనాయై నమః
ఓం రాజరాజార్చిత పదసరోజాయై నమః
ఓం సర్వవేదాంత సంసిద్ధ సుతత్త్వాయై నమః
ఓం శ్రీ వీరభక్త విజ్ఞాన నిధానాయై నమః
ఓం అశేష దుష్ట దనుజసూదనాయై నమః
ఓం సాక్షాచ్ఛ్రీ దక్షిణామూర్తి మనోజ్ఞాయై నమః
ఓం హయమేధాగ్రసంపూజ్య మహిమాన్యై నమః
ఓం దక్షప్రజాపతి సుతావేషాఢ్యాయై నమః
ఓం సుమబాణేక్షుకోదండమండితాయై నమః
ఓం నిత్యయౌవన మంగళ్యమంగళాయై నమః
ఓం మహాదేవ సమాయుక్తశరీరాయై నమః
ఓం మహాదేవరతౌత్సుక్య మహాదేవ్యై నమః

శ్రీ మహాకాళీ శ్రీ మహాలక్ష్మీ శ్రీ మహా సరస్వతీ స్వరూపిణీ శ్రీ దుర్గాంబికా పరదేవతాయై నమః
శ్రీ లలితా త్రిపుర సుందరి అష్టోత్తర శతనామావళి పూజా సమర్పయామి

# శ్రీ మహా లక్ష్మీ దేవి



## 6. షష్ఠమం-అష్టైశ్వర్యప్రదాయం! శ్రీ మహాలక్ష్మీ దేవి అలంకారం

శరన్నవరాత్రులలో ఆరవ రోజున అమ్మవారిని మహాలక్ష్మీ దేవి అలంకారంలో అర్చించుకుంటే ఐశ్వర్యప్రదమని భక్తుల ప్రగాఢ విశ్వాసం! కనుక మనందరం కూడా శ్రీ మహాలక్ష్మీ దేవి రూపంలో అమ్మవారిని మనసారా కొలుచుకుందాము.

శ్రీ మహాలక్ష్మీదేవి ఇరువైపులా గజరాజులు సేవిస్తుండగా, చతుర్భుజాలతో, ఒక హస్తం అభయముద్రతో, రెండు హస్తాలలో కమలాలతో, ఒక హస్తంతో కనకధార కురిపిస్తూ తన చల్లని చూపులతో త్రిలోకాలను కాస్తూ ఉంటారు. మనం కూడా ఆ దివ్యమంగళ స్వరూపాన్ని హృదయం లో స్థాపించుకుని అర్చించుకుందాము. భక్తులను గజలక్ష్మి రూపేణ పాలిస్తుంది. శ్రీ మహాలక్ష్మీ అవతారంలో అమ్మవారిని ఎర్ర కమలాలతో కొలిస్తే సర్వశ్రేష్టం! మహా కాళి మహాలక్ష్మీ మహా సరస్వతులలో ఈమె మధ్య శక్తి.

'విష్ణుపత్నీం, ప్రసన్నాక్షీం, నారాయణ సమాశ్రితాం! దారిద్ర ధ్వంసినీం, దేవీం సర్వోపద్రవ వారిణీం!' అయిన శ్రీ మహాలక్ష్మీ తన భక్తులను ఎన్నడూ నిరాశపరచదు. సర్వమంగళాలను, అష్టైశ్వర్యాలను ప్రసాదిస్తుంది. 'యాదేవి సర్వ భూతేషు లక్ష్మి రూపేణ సంస్థితా!' అని స్తుతిస్తూ ఎర్రని పుష్పాలతో శ్రీ మహాలక్ష్మీ దేవిని శ్రీసూక్తసహితంగా సకల ఉపచారాలు జరిపించి, అర్చించుకుని, పూర్ణాలు, క్షీరాన్నం, వడపప్పు, పానకం అమ్మవారికి నివేదించుకుందాము. భక్తులకు దేనికీ కొదవ ఉండదు. అష్టలక్ష్మీ స్తోత్రం, కనకధారాస్తోత్రం పారాయణం చేసుకుంటే ఎంతో శుభప్రదం!

ఈ నాడు దరించ వలసిన వర్ణం: గులాబీ రంగు

ఈ నాటి నివేదనలు:

నివేదనలువడపప్పు, పానకం, పూర్ణాలు, క్షీరాన్నం వీటిలో మొదటి రెండూ మనం ముందే తెలుసుకున్నాం. ఈ రోజు పూర్ణాలు, క్షీరాన్నం గురించి గుర్తుచేసుకుందాం.

పూర్ణాలు: వీటినే పూర్ణం బూరెలు అని కూడా అంటారు.

కావలిసిన వస్తువులు: ఒక గ్లాసు మినప్పప్పు, ఒక అరగ్లాసు బియ్యం, ఒక గ్లాసు పచ్చిశనగ పప్పు, గ్లాసుడు బెల్లం పొడి,యాలుకులు -6, పూర్ణాలు వేయించడానికి సరి పడ నూనె.

తయారు చేయువిధానం: మినప్పప్పు, బియ్యం నాలుగైదు గంటల ముందుగా నానబెట్టుకోవాలి. శనగ పప్పు ఒక గిన్నెలో వేసి తగినన్ని నీళ్లు పోసి, కుక్కర్లో కాకుండా విడిగా ఉడకబెట్టుకోవాలి. ఉడికిన తర్వాత పప్పుని నీళ్లన్నీ ఓడ్చి, ఒక చిల్లుల పళ్ళెం లో ఆరబెట్టుకోవాలి. నీళ్లు మొత్తం పోయి ఆరతాయి. ఇప్పుడు బెల్లం పొడిని ఒక దళసరి మూకుడులో వేసి తడవడానికి సరిపడా నీళ్లు పోసి, స్టవ్ మీద పెట్టాలి. పాకం తయారయ్యే లోపు ఆరిన శనగపప్పు, యాలకులను మిక్సీ లోవేసి పొడిగా చేసుకోవాలి. దీనిని ఉడుకుతున్న పాకంలో వేసి గట్టి పడి ఉండ పాకం వచ్చేలాగా చూసుకోవాలి. అప్పుడు స్టవ్ మీదనుండి దింపి చల్లారనివ్వాలి. ఈ లోగా మనం నానబెట్టుకున్న మినప్పప్పు, బియ్యం గ్రైండర్ లో మెత్తగా జాలు వారుగా బజ్జీ పిండి లాగా తోపు పిండి చేసుకోవాలి. చల్లారిన శనగ పప్పు,

బెల్లం పాకాన్ని కొంచెం నెయ్యి చేతికి రాసుకుంటూ, గుండ్రటి ఉండలుగా నిమ్మకాయ పరిమాణం లో చేసుకోవాలి. ఈ పూర్ణం ఉండలని తోపులో ముంచి, కాగిన నూనెలో వేసి బంగారం రంగులో వేయించుకోవాలి. అమ్మ వారికిష్టమైన పూర్ణం బూరెలు సిద్ధం. వీటినే కొందరు పూర్ణాలు అని, కొందరు బూరెలు అని అంటారు. బూరెకి మధ్యలో చిల్లు పెట్టి, స్వచ్ఛమైన నెయ్యితో నింపి, తింటే అద్భుతః!

క్షీరాన్నం:

కావలిసిన వస్తువులు: ఒక లీటర్ ఆవు పాలు, రెండు గ్లాసుల బియ్యం, చారెడు పెసరపప్పు, (శుభానికి చేసుకునే పరమాన్నం ఎప్పుడూ బియ్యానికి పెసరబద్దలు కాని శనగపప్పు కాని వేయకుండా చేయకూడదని పెద్దలు చెపుతారు), రెండు లేక ఎక్కువ తీపి అక్కర్లేనివారు ఒకటిన్నర గ్లాసు పంచదార, యాలకులు-6, జీడిపప్పు, బాదం పప్పు ముక్కలు, కిస్మిస్ సరిపడా.

తయారు చేసే విధానం: ముందుగా ఒక దళసరి గిన్నె శుభ్రంగా కడిగి అందులో పాలు పోసి స్టవ్ మీద పెట్టాలి. బియ్యం రాళ్ళు అవి లేకుండా శుభ్రం చేసుకోవాలి. దైవ కార్యానికై పరమాన్నం చేసేటప్పుడూ తడిబియ్యం వాడకూడదు అంటారు. అందుకనే పాలు కాగాక, పొడి బియ్యం, పెసరపప్పు పాలల్లో వేసి, సన్న సెగ మీద ఉడకనివ్వాలి. అడుగంటకుండా మధ్యమధ్య కలుపుతూ ఉండాలి. అన్నం ఉడకటానికి వచ్చినప్పుడు పంచదార కూడా కలిపి కలుపుతూ ఇంకొం చెంసేపు అంటే ఒక అయిదు నిమిషాల సేపు ఉడకనివ్వాలి. ఒక చిన్న మూకుడు స్టవ్ మీద పెట్టి, రెండు చెంచాల నెయ్యి వేసి, జీడిపప్పు, బాదం పప్పు, కిస్మిస్ వేసి వేయించి, ఉడుకుతున్న పరమాన్నంలో కలపాలి స్టవ్ ఆర్పేసి పరమాన్నం కిందకు దించేయండి. యాలకులను పొడి చేసి క్షీరాన్నంలో కలపండి. క్షీరాన్నం తయారైపోయింది అమ్మ వారు క్షీరాన్నప్రియ అని మనకు తెలుసుకదా? అందుకని శ్రీ మహాలక్ష్మీ అవతారం రోజున శ్రద్ధగా పూర్ణాలు, క్షీరాన్నం చేసి, భక్తిగా నివేదించుకుని, అమ్మ వారిని ప్రసన్నం చేసుకుందాము.

## శ్రీ లక్ష్మీ అష్టోత్తర శతనామావళి

ఓం ప్రకృత్యై నమః
ఓం వికృత్యై నమః
ఓం విద్యాయై నమః
ఓం సర్వభూతహితప్రదాయై నమః
ఓం శ్రద్ధాయై నమః
ఓం విభూత్యై నమః
ఓం సురభ్యై నమః
ఓం పరమాత్మికాయై / వాచే నమః
ఓం పద్మాలయాయై నమః
ఓం పద్మాయై /శుచ్యై నమః
ఓం స్వాహాయై నమః
ఓం స్వధాయై నమః
ఓం సుధాయై నమః
ఓం ధన్యాయై నమః
ఓం హిరణ్మయై / లక్ష్మ్యై నమః
ఓం నిత్యపుష్టాయై నమః

ఓం విభావర్యై నమః
ఓం ఆదిత్యై / దిత్యై నమః
ఓం దీప్తాయై / వసుధాయై నమః
ఓం వసుధారిణ్యై / కమలాయై నమః
ఓం కాంతాయై / కామాక్ష్యై నమః
ఓం క్రోధసముద్భవాయై నమః
ఓం అనుగ్రహప్రదాయై నమః
ఓం బుద్ధ్యై / అనఘాయై నమః
ఓం హరివల్లభాయై నమః
ఓం అశోకాయై / అమృతాయై నమః
ఓం దీప్తాయై నమః
ఓం లోకశోకవినాశిన్యై నమః
ఓం ధర్మనిలయాయై నమః
ఓం కరుణాయై నమః
ఓం లోకమాత్రే నమః
ఓం పద్మప్రియాయై నమః
ఓం పద్మహస్తాయై నమః
ఓం పద్మాక్ష్యై నమః
ఓం పద్మసుందర్యై నమః
ఓం పద్మోద్భవాయై నమః
ఓం పద్మముఖ్యై నమః
ఓం పద్మనాభప్రియాయై నమః
ఓం రమాయై నమః
ఓం పద్మమలాదరాయై నమః
ఓం దేవ్యై నమః
ఓం పద్మిన్యై నమః
ఓం పద్మగంధిన్యై నమః
ఓం పుణ్యగంధాయై నమః
ఓం సుప్రసన్నయై నమః

ఓం ప్రసాదాభిముఖ్యై నమః
ఓం ప్రభాయై నమః
ఓం చంద్రవదనాయై నమః
ఓం చంద్రాయై నమః
ఓం చంద్రసహోదర్యై నమః
ఓం చతుర్భుజాయై నమః
ఓం చంద్రరూపాయై నమః
ఓం ఇందిరాయై నమః
ఓం ఇందుశీతలాయై నమః
ఓం ఆహ్లాదజనన్యై నమః
ఓం పుష్ట్యై / శివాయై నమః
ఓం శివకర్యై / సత్యై నమః
ఓం విమలాయై నమః
ఓం విశ్వజనన్యై నమః
ఓం పుష్ట్యై నమః
ఓం దారిద్రనాశిన్యై నమః
ఓం ప్రీతిపుష్కరిణ్యై నమః
ఓం శాంతాయై నమః
ఓం శుక్లమాల్యాంబరాయై నమః
ఓం శ్రియై నమః
ఓం భాస్కర్యై నమః
ఓం బిల్వనిలయాయై నమః
ఓం వరారోహాయై నమః
ఓం యశస్విన్యై నమః
ఓం వసుంధరాయై నమః
ఓం ఉదారాగ్యై నమః
ఓం హేమమాలిన్యై నమః
ఓం హరిణ్యై నమః
ఓం ధనధాన్యకర్యై నమః

ఓం సిద్ధ్యై నమః
ఓం స్త్రైణసౌమ్యాయై నమః
ఓం శుభప్రదాయై నమః
ఓం నృపవేశ్మగతానందాయై నమః
ఓం వరలక్ష్మ్యై నమః
ఓం వసుప్రదాయై నమః
ఓం శుభాయై నమః
ఓం హిరణ్యప్రాకారాయై నమః
ఓం సముద్రతనయాయై నమః
ఓం జయాయై / మంగళాయై నమః
ఓం దేవ్యై నమః
ఓం విష్ణువక్షస్థలస్థితాయై నమః
ఓం విష్ణుపత్న్యై నమః
ఓం ప్రసన్నాక్ష్యై నమః
ఓం నారాయణసమాశ్రితాయై నమః
ఓం దారిద్ర్యధ్వంసిన్యై / దేవ్యై నమః
ఓం సర్వోపద్రవవారిణ్యై నమః
ఓం నవదుర్గాయై నమః
ఓం మహాకాళ్యై నమః
ఓం బ్రహ్మవిష్ణుశివాత్మికాయై నమః
ఓం త్రికాలజ్ఞానసంపన్నాయై నమః
ఓం భువనేశ్వర్యై నమః

శ్రీ మహాకాళీ శ్రీ మహాలక్ష్మీ శ్రీ మహా సరస్వతీ స్వరూపిణీ శ్రీ దుర్గాంబికా పరదేవతాయై నమః
శ్రీ లక్ష్మీ అష్టోత్తర శతనామావళి పూజా సమర్పయామి

# శ్రీ సరస్వతీ దేవి


సరస్వతీ నమస్తుభ్యం వరదే కామరూపిణీ
విద్యారంభం కరిష్యామి సిద్ధిర్భవతు మే సదా
పద్మపత్ర విశాలాక్షీ పద్మకేసరవర్ణినీ
నిత్యం పద్మాలయాం దేవీ సామాంపాతు సరస్వతీ

## 7. సప్తమం సర్వవిద్యాప్రదాయకం - శ్రీ సరస్వతి దేవి అలంకారం

శరన్నవరాత్రులలో ఏడవ రోజున సప్తమి తిథి నాడు సాధారణంగా మూలా నక్షత్రం వస్తుంది. ఆ రోజున అమ్మవారిని వాగ్దేవీ అలంకారంలో ఉపచారాలు చేస్తారు. మూలా నక్షత్రము రోజున మనమందరం అమ్మవారిని శ్వేత పద్మాన్ని అధిష్టించి, వీణ, కమండలం, అక్షరమాలను ధరించి, అభయ ముద్రతో విరాజిల్లే శ్రీ సరస్వతీ దేవిని హృదయంలో ముద్రించుకుని ఆ దేవిని పూజించుకుందాము. ఈ దేవికున్న అనేక నామాలలో శ్రీ శారదా దేవి అతి విశిష్టమైనది. ఈ రోజు తల్లితండ్రులు తమపిల్లల చేత విద్యాబుద్ధులకై సరస్వతీ పూజ తప్పక చేయిస్తారు. చిన్నపిల్లలకు అక్షరాభ్యాసం కూడా చేస్తారు. దేవీ నవరాత్రులలో చివరి మూడు రాత్రులూ చేసే త్రిరాత్రవ్రతం ఈ రోజే ఆరంభిస్తారు.

వీణాధరే! విపుల మంగళ దానశీలే! భక్తార్తినాశిని! విరించి హరీశ వంద్యే!
కీర్తిప్రదే! అఖిల మనోరదే! మహార్హే! విద్యాప్రదాయిని! సరస్వతి! నౌమి నిత్యం!

అని మనసారా స్తుతిస్తే భక్తుల అజ్ఞాన తిమిరాలను తొలగించి, వారి హృదయాల్లో జ్ఞానజ్యోతులను ప్రకాశింపజేస్తుంది. వాక్ శక్తిని, స్ఫూర్తిని ప్రసాదిస్తుంది. సరస్వతీదేవి త్రిశక్తి రూపాల్లో మూడవ రూపం! ప్రాణకోటి జిహ్వాగ్రంపై నివసిస్తుంది. వ్యాసుడు, వాల్మీకి మరియు కాళిదాసులను అనుగ్రహించి, వారి వాక్ వైభవాన్ని విశ్వవిఖ్యాతి చెందేలా చేసింది ఈ వీణా పుస్తకధారిణి! మనమందరం కూడా శ్రీ సరస్వతీదేవిని శక్తి కొలది అర్చించి, షోడశోపచారాలతో అష్టోత్తర నామాలతో కుంకుమ పూజ గావించి, వడపప్పు, చలిమిడి, పానకం, అటుకులు, బెల్లం, అన్నం పరమాన్నం, దధ్యోదనం నివేదన చేసి, మన విద్యాబుద్ధులను పెంపొందిచుకుందాము.

అన్నం పరమాన్నం మరియు దధ్యోదనం చేసే విధానం ముందుగానే వివరించి ఉన్నందున ఒక్కసారి చూసుకుని, చక్కగా చేసి అమ్మ వారికి నివేదించుకుని ఆ తల్లి అపార అనుగ్రహం పొందండి.

ఈ నాడు ధరించవలసిన వర్ణం: తెలుపు

### శ్రీ సరస్వతీ అష్టోత్తర శతనామావళి

శరన్నవరాత్రులలో మూలా నక్షత్రానికి ప్రత్యేక విశిష్టత ఉన్నది. చదువుల తల్లి సరస్వతీదేవి రూపములో దుర్గాదేవి దర్శనమిచ్చే పవిత్రమైన రోజు. ఈ రోజు అమ్మను కొలిస్తే విద్యార్థులకు చక్కని బుద్ధిని వికాసము కలుగుతుంది.

ఓం సరస్వత్యై నమః
ఓం మహాభద్రాయై నమః
ఓం మహామాయాయై నమః
ఓం వరప్రదాయై నమః
ఓం శ్రీప్రదాయై నమః
ఓం పద్మనిలయాయై నమః
ఓం పద్మాక్ష్యై నమః
ఓం పద్మవక్త్రాయై నమః
ఓం శివానుజాయై నమః
ఓం పుస్తకహస్తాయై నమః
ఓం జ్ఞానసముద్రాయై నమః
ఓం రమాయై / పరాయై నమః

ఓం కామరూపిణ్యై నమః
ఓం మహావిద్యాయై నమః
ఓం మహాపాతకనాశి న్యై నమః
ఓం మహాశ్రయాయై నమః
ఓం మాలిన్యై నమః
ఓం మహాభోగాయై నమః
ఓం మహాభుజాయై నమః
ఓం మహాభాగ్యాయై నమః
ఓం మహోత్సాహాయై నమః
ఓం దివ్యాంగాయై నమః
ఓం సురవందితాయై నమః
ఓం మహాకాళ్యై నమః
ఓం మహాపాశాయై నమః
ఓం మహాంకుశాయై నమః
ఓం సీతాయై / విమలాయై నమః
ఓం విశ్వాయై నమః
ఓం విద్యున్మలాయై / వైష్ణవ్యై నమః
ఓం చంద్రికాయై నమః
ఓం చంద్రవదనాయై నమః
ఓం చంద్రలేఖావిభూషితాయై నమః
ఓం సావిత్ర్యై / సురసాయై నమః
ఓం దేవ్యై నమః
ఓం దివ్యాలంకారభూషితాయై నమః
ఓం వాగ్దేవ్యై నమః
ఓం వసుధాయై / తీవ్రాయై నమః
ఓం మహాభద్రాయై నమః
ఓం మహాబలాయై నమః
ఓం భోగదాయై నమః
ఓం భారత్యై నమః
ఓం భామాయై నమః
ఓం గోవిందాయై నమః

ఓం గోమత్యై నమః
ఓం శివాయై నమః
ఓం జటిలాయై నమః
ఓం వింధ్యావాసాయై నమః
ఓం వింధ్యాచలవిరాజితాయై నమః
ఓం చండికాయై నమః
ఓం వైష్ణవ్యై / బ్రహ్మ్యై నమః
ఓం బ్రహ్మజ్ఞానైక సాధనాయై నమః
ఓం సౌదామిన్యై నమః
ఓం సుధామూర్తయే నమః
ఓం సుభద్రాయై నమః
ఓం సురపూజితాయై నమః
ఓం సువాసిన్యై నమః
ఓం సువాసాయై నమః
ఓం వినిద్రాయై నమః
ఓం పద్మలోచనాయై నమః
ఓం విద్యారుపాయై నమః
ఓం విశాలాక్ష్యై నమః
ఓం బ్రహ్మధ్యేయాయై నమః
ఓం మహాఫలాయై నమః
ఓం త్రయీమూర్త్యై నమః
ఓం త్రికాలజ్ఞాయై నమః
ఓం త్రిగుణాయై నమః
ఓం శాస్త్రరూపిణ్యై నమః
ఓం శుమ్భాసురప్రమథిన్యై నమః
ఓం శుభదాయై నమః
ఓం సర్వాత్మికాయై నమః
ఓం రక్తబీజనిహంత్ర్యై నమః
ఓం చాముండాయై నమః
ఓం అంబికాయై నమః
ఓం ముండకాయప్రహరణాయై నమః

ఓం ధూమ్రలోచనమర్దనాయై నమః
ఓం సర్వదేవస్తుతాయై నమః
ఓం సౌమ్యాయై నమః
ఓం సురాసురనమస్కృతాయై నమః
ఓం కాళరాత్ర్యై నమః
ఓం కలాధారాయై నమః
ఓం రూపసౌభాగ్యదాయిన్యై నమః
ఓం వాగ్దేవ్యై నమః
ఓం వరారోహాయై నమః
ఓం వారాహ్యై నమః
ఓం వారిజా సనాయై నమః
ఓం చిత్రాంబరాయై నమః
ఓం చిత్రాంగదాయై నమః
ఓం చిత్రమాల్య విభూషితాయై నమః
ఓం కాంతాయై నమః
ఓం కామ్రపదాయై నమః
ఓం వంద్యాయై నమః
ఓం విద్యాధరసుపూజితాయై నమః
ఓం రూపసౌభాగ్యదాయిన్యై నమః
ఓం శ్వేతాననాయై నమః
ఓం నీలభుజాయై నమః
ఓం చతుర్వర్గఫలప్రదాయై నమః
ఓం చతురాననసామ్రాజ్యై నమః
ఓం నిరంజనాయై నమః
ఓం హంసాసనాయై నమః
ఓం రక్తమధ్యాయై నమః
ఓం నీలజంఘాయై నమః
ఓం బ్రహ్మవిష్ణుశివాత్మికాయై నమః

శ్రీ మహాకాళీ శ్రీ మహాలక్ష్మీ శ్రీ మహా సరస్వతీ స్వరూపిణీ శ్రీ దుర్గాంబికా పరదేవతాయై నమః
శ్రీ సరస్వతీ శతనామావళి పూజా సమర్పయామి

# శ్రీ దుర్గా దేవి (దుర్గాష్టమి)



## 8. దుర్గాష్టమం-దురితనివారిణం! శ్రీ దుర్గా దేవి అలంకారం

ముందుగా 'దుర్గాష్టమి' నాడు అమ్మవారిని ఏ విధంగా అలంకరించాలో చూద్దాం. 'దుర్గామాత' అని తలవగానే మన మదిలో త్రిశూలధారియై, వ్యాఘ్రవాహన అయి, శరణు కోరినవారిని రక్షించే చల్లని చూపుతో ప్రత్యక్షమవుతుంది. ఆ సకల శక్తి స్వరూపిణిని 'ఓం కాత్యానాయ విద్మహే కన్యకుమారి ధీమహీ! తన్నో దుర్గీ ప్రచోదయాత్!' అంటూ ప్రార్ధన చేసి, ఆరాధిస్తే, భక్తుల దుర్గతులు దూదిపింజల్లా ఎగిరిపోతాయి.

దుర్గముడనే అసురుని సంహారం చేయడానికి, దుర్గాదేవిగా ఆవిర్భవించింది మహేశ్వరి! ఆ రక్కసుని ఎలా అంతమొందించిందో భక్తుల దుర్గమాలను(కష్టాలను) కూడా అలాగే రూపుమాపుతుంది దుర్గమ్మ! రాహుగ్రహ దోషాలను నివారించి, భక్తుల కష్టాలను శీఘ్రం గా దూరం చేస్తుంది. 'ఓం దుం దుర్గాయనమః' అని వీలైనన్ని సార్లు జపిస్తే శత్రు బాధలు తొలగి, సుఖశాంతులు కలుగుతాయి. శ్రీ లలితాసహస్రనామ స్తోత్రంతో పాటు శ్రీ దేవీ ఖడ్గమాలా స్తోత్రం పారాయణం చేసుకుంటే, భక్తుల కోరిన కోరికలు ఈడేరుతాయి. దుర్గాష్టమి నాడే 6 నుండి 12 సంవత్సరాల లోపు ఆడపిల్లలకు పూజ చేసి, తాంబూలాలు, కానుకలు ఒసగుతారు. బొమ్మలకొలువు పేరంటం కొనసాగిస్తారు. సరస్వతీదేవి పూజనాడు మొదలు పెట్టిన త్రిరాత్రవ్రతం ఈ రోజు కొనసాగిస్తారు. ఈ విశిష్ట పర్వదినాన శ్రీ దుర్గా దేవికి మిక్కిలి ప్రీతికరమైన పులగాన్నం మరియు పులిహోర నివేదన చేస్తే చాలా ఫలప్రదం!

ఈ నాడు ధరించవలసిన వర్ణం: ఎరుపు రంగు.

ఈ నాటి నివేదనలు: పులిహోర, పులగాన్నం

పులిహోర ఐదవ అలంకారమైన శ్రీలలితాత్రిపుర సుందరి అలంకారం లో వివరంగా తెలుసుకున్నాము. కనుక ఇప్పుడు పులగాన్నం అంటే ఏమిటో, ఎలాచేయాలో, దాని విశిష్టత ఏమిటో తెలుసుకుందాము. పులగాన్నం చాలా సులభంగా చేసుకోవచ్చు. కాని దైవ నివేదనలలో ఎంతో విశిష్టత కలిగినది. పులగాన్న నివేదన మహానివేదనకు సమానమైనది.

పులగాన్నం తయారీకి కావలిసిన వస్తువులు, తయారు చేసే విధానం:

బియ్యం మరియు ఛాయ పెసరపప్పు. రెండు గ్లాసుల బియ్యానికి చారెడు పెసరబద్దలు చాలు. పెసరపప్పు ఒక పదినిమిషాలు నీళ్ళల్లో నానబెట్టండి. ఇప్పుడు బియ్యం తీసుకుని శుభ్రంగా కడిగి, బియ్యానికి రెట్టింపు కన్నా కొంచెం తక్కువగా నీళ్ళు పోసి, పైన పెసరపప్పు వేయండి. రుచికి కొంచెం ఉప్పు వేయండి. కుక్కర్లో కానీ ఒక దళసరి ఇత్తడి గిన్నలో కాని ఉడకబెట్టండి. మరీ మెత్తగా ఉడకక్కరలేదు. పులగాన్నం కొంచెం బిరుసుగానే బాగుంటుంది. పెసరపప్పు కూడా బద్దలుగా కనిపించాలి. ఉడికిన తర్వాత పైన రెండు చెంచాల నెయ్యి వేయండి. నివేదన చేసేటప్పుడు పైన చిన్న బెల్లం ముక్క పెట్టండి. చూసారా ఎంత సులభమో చేసుకోవడం? దీనినే 'పులగం' అనికూడా అంటారు. మన నిత్యపూజలో భగవంతునికి అన్ని పదార్ధాలతో మహానివేదన చేయాలని వున్నా

సమయాభావం చేత చేయలేకపోతున్నామే అని వాపోయే వారు ఈ పులగాన్నం చేసి, ఒక చిన్న బెల్లం ముక్కతో దైవానికి నివేదిస్తే మహానివేదన చేసినట్టే! పులిహార, పులగాన్నంతో పాటు అమ్మవారికి వడపప్పు, పానకం, పచ్చిచలిమిడి నివేదించుకోవచ్చు. ఇవండీ దుర్గాష్టమి విశేషాలు!

## దకారాది శ్రీ దుర్గాష్టోత్తర శతనామావళి

ఓం దుర్గాయై నమః
ఓం దుర్గమార్గస్థలస్థానాయై నమః
ఓం దుర్గతిహరాయై నమః
ఓం దుర్గమార్గవిలాసిన్యై నమః
ఓం దుర్గాచలనివాసిన్యై నమః
ఓం దుర్గమార్గత్యక్తాస్త్రాయై నమః
ఓం దుర్గమార్గానుసంచారాయై నమః
ఓం దుర్గమార్గప్రవర్తిన్యై నమః
ఓం దుర్గమార్గ నివాసిన్యై నమః
ఓం దుర్గాసురనిహంత్ర్యై నమః
ఓం దుర్గమార్గ ప్రవిష్టాయై నమః
ఓం దుర్గాసుర నిషూదిన్యై నమః
ఓం దుర్గమార్గ ప్రవేశిన్యై నమః
ఓం దుర్గాసురహరాయై నమః
ఓం దుర్గమార్గకృతావాసాయై నమః
ఓం దుర్గమాయై నమః
ఓం దుర్గమార్గజయ ప్రియాయై నమః
ఓం దుర్గాసురవధోన్మత్తాయై నమః
ఓం దుర్గమార్గగృహీతార్చాయై నమః
ఓం దుర్గాసురవధోత్సాహాయై నమః
ఓం దుర్గమార్గస్థితాత్మికాయై నమః
ఓం దుర్గాసురవధోద్యతాయై నమః
ఓం దుర్గమార్గస్తుతిపరాయై నమః
ఓం దుర్గాసురవధప్రేప్స్యాయై నమః
ఓం దుర్గమార్గ స్మృతి పరాయై నమః
ఓం దుర్గాసురమఖాంతకృతే నమః
ఓం దుర్గమార్గసదాస్థాయిన్యై నమః
ఓం దుర్గాసురధ్వంసతోషాయై నమః
ఓం దుర్గమార్గరతి ప్రియాయై నమః
ఓం దుర్గాదానవదారిణ్యై నమః
ఓం దుర్గయుద్ధమహామత్తాయై నమః
ఓం దుర్గావిద్రావణకర్త్ర్యై నమః
ఓం దుర్గయుద్ధానుసారిణ్యై నమః
ఓం దుర్గవిద్రావిణ్యై నమః
ఓం దుర్గయుద్ధోత్సాహాయై నమః
ఓం దుర్గవిక్షోభణ కర్త్ర్యై నమః
ఓం దుర్గదేశనిషేవిణ్యై నమః
ఓం దుర్గశీర్షనికృన్తిన్యై నమః
ఓం దుర్గదేశ వాసరతాయై నమః
ఓం దుర్గవిధ్వంసనకర్త్ర్యై నమః
ఓం దుర్గదేశవిలాసిన్యై నమః
ఓం దుర్గదైత్యనికృన్తిన్యై నమః
ఓం దుఃఖహంత్ర్యై నమః
ఓం దుర్గదైత్యప్రాణహరాయై నమః
ఓం దుర్గదైత్యాంతకారిణ్యై నమః
ఓం దేవకామాయై నమః
ఓం దుర్గదైత్యహరత్రాత్ర్యై నమః
ఓం దేవదేవ ప్రియాయై నమః
ఓం దుర్గదైత్యాసృగున్మదాయై నమః
ఓం దేవదానవవందితాయై నమః
ఓం దుర్గదైత్యాశనకర్త్ర్యై నమః
ఓం దేవదేవ విలాసిన్యై నమః
ఓం దుర్గచర్మాంబరావృతాయై నమః
ఓం దేవదేవసుఖప్రదాయై నమః

ఓం దుర్గయుద్ధవిశారదాయై నమః
ఓం దేవదేవగతాత్మికాయై నమః
ఓం దుర్గయుద్ధోత్సవకర్త్యై నమః
ఓం దేవతాతనవే నమః
ఓం దుర్గయుద్ధాసవరతాయై నమః
ఓం దయాసింధవే నమః
ఓం దుర్గయుద్ధవిమర్దిన్యై నమః
ఓం దయాంబుధయే నమః
ఓం దుర్గయుద్ధాట్టహాసిన్యై నమః
ఓం దయాసాగరాయై నమః
ఓం దుర్గయుద్ధహాస్యరతాయై నమః
ఓం దయాయై నమః
ఓం దుఃఖహీనాయై నమః
ఓం దయాళవే నమః
ఓం దీనబంధవే నమః
ఓం దయాశీలాయై నమః
ఓం దక్షహంత్రే నమః
ఓం దయార్ద్రహృదయాయై నమః
ఓం దీనమాత్రే నమః
ఓం దేవ్యై నమః
ఓం దక్షాధ్వర వినాశిన్యై నమః
ఓం దరాందోళిత దీర్ఘాక్ష్యై నమః
ఓం దీన సేవ్యాయై నమః
ఓం దీర్ఘచక్షుషే నమః
ఓం దేశకాల పరిచ్ఛిన్నాయై నమః
ఓం దీర్ఘలోచనాయై నమః
ఓం సిద్ధాయై నమః
ఓం దీర్ఘనేత్రాయై నమః
ఓం దీనవత్సలాయై నమః
ఓం దీర్ఘబాహవే నమః
ఓం దేవకన్యాయై నమః
ఓం దీర్ఘసాగరమధ్యస్థాయై నమః
ఓం దేవమాన్యాయై నమః
ఓం దయాశ్రయాయై నమః
ఓం దేవసిద్ధాయై నమః
ఓం దయాంబునిధయే నమః
ఓం దేవపూజ్యాయై నమః
ఓం దాశరథి ప్రియాయై నమః
ఓం దేవదేవ్యాయై నమః
ఓం దశభుజాయై నమః
ఓం దేవవందితాయై నమః
ఓం దిగంబరవిలాసిన్యై నమః
ఓం దైవ్యై నమః
ఓం దుర్గమాయై నమః
ఓం దేవధన్యాయై నమః
ఓం దురితాపహారిణ్యై నమః
ఓం దేవరమ్యాయై నమః
ఓం దుష్ట దూరాయై నమః
ఓం దురాచార్య శమన్యై నమః
ఓం దౌహృదాయై నమః
ఓం దీనబంధవాయై నమః
ఓం దారిద్ర్యధ్వంసిన్యై నమః
ఓం శ్రీ దుర్గాంబికాయై నమః ॥

శ్రీ మహాకాళీ శ్రీ మహాలక్ష్మీ శ్రీ మహా సరస్వతీ స్వరూపిణీ శ్రీ దుర్గాంబికా పరదేవతాయై నమః
దకారాది శ్రీ దుర్గా అష్టోత్తర శతనామావళి పూజా సమర్పయామి

# శ్రీ మహిషాసుర మర్దినీ దేవి(మహర్నవమి)



## 9. మహానవమ్యాం - మహిమాన్వితం! 'మహిషాసురమర్ధినీ అవతారం!

శరన్నవరాత్రులలో నవమి రోజు 'మహానవమి'గా ప్రాశస్త్యం పొందింది. అమ్మవారి అలంకారం మహిమాన్వితమైన 'మహిషాసురమర్ధినీ అవతారం! అమ్మవారు ఉగ్రరూపంతో, చేతిలో త్రిశూలంతో సింహ వాహినియై దుష్టశిక్షణ గావిస్తూ వుంటుంది. మనం మొదట్లో చెప్పుకున్న విధంగా మహిషాసురుడనే రక్కసుడు శివుని దగ్గర అమరత్వాన్ని వరంగా పొంది, ఇంద్రుడిని ఓడించి, దేవతలకు కూడా హాని తలపెట్టడంతో అందరూ పరుగు పరుగున శివకేశవుల దగ్గరకు వెళ్లి, రక్షించమని వేడుకోవడంతో సమస్తదేవతల నుండి శక్తి వెలువడి, ప్రత్యేకమైన ఉగ్రమూర్తిగా రూపొంది, మహిషాసురుని యుద్ధానికి ప్రేరేపించి దుష్టశక్తిని అణచదలచింది. ఆశ్వయుజ శుద్ధ పాడ్యమి నుండి నవమి దాకా పోరు సలిపి, ఆశ్వయుజ శుక్ల నవమి దినమున ఆ రక్కసుని అంతమొందించి, దుష్ట శిక్షణ, శిష్ట రక్షణ గావించింది. అందుచేతనే ఈ నవమిని మహానవమి గా భక్తులు జరుపుకుంటారు. త్రిరాత్ర వ్రతం కొనసాగిస్తారు. బొమ్మలకొలువు పేరంటం జరుపుతారు. కొన్ని ప్రాంతాలవారు వాహన పూజ మహానవమి నాడు చేసుకుంటారు.

పరమేశ్వరిని మహిషాసురమర్ధిని అవతారంలో అనేక విధాలుగా పూజించి, 'జయ జయహే మహిషాసురమర్ధిని రమ్యక పర్దని శైలసుతే...!' అంటూ ఉగ్రమూర్తిగా ఉన్న అమ్మవారికి వడపప్పు, పానకం, చలిమిడి, పులిహోర, పులగాన్నం, గారెలు, నిమ్మరసం నివేదన చేసి, శాంతింపచేస్తారు. మనం కూడా శైలపుత్రిని ఈ రోజు మహిషాసురమర్ధినిగా, మన మనస్సులలో నిలుపుకుని, మహిషాసుర మర్ధిని స్తోత్రం, లలితాసహస్రనామ స్తోత్రంతో షోడశోపచార పూజలు చేసి అమ్మ వారి కరుణాకటాక్షాలు పొందుదాం!

ధరించవలసిన వర్ణం: కాఫీ రంగు

ఈనాటి నివేదనలు: మినప గారెలు

వడపప్పు, పానకం, చలిమిడి, పులగాన్నం చేయడం ముందు అవతారాల్లో నేర్చుకున్నందున ఇప్పుడు గారెలు చేసే విధానం తెలుసుకుందాం! ఉదయమే లేచి, స్నానం చేసిన వెంటనే రెండు గ్లాసుల మినప్పప్పుకి ఒక గుప్పెడు పొట్టు మినపప్పు కలిపి నానబెట్టండి. పప్పు బాగా నానిన తర్వాత తగినంత ఉప్పు వేసి, మెత్తగా గట్టిగా రుబ్బుకోవాలి. స్టవ్ మీద దళసరి మూకుడు పెట్టి గారెలు వేగడానికి సరి పడా నూనె పోసి, వేడెక్కాక, రుబ్బుకున్న పిండిని గారెల ఆకారంలో ఒక ఆకు మీద కానీ, ప్లాస్టిక్ కవర్ మీద కానీ చేసుకుని నూనెలో వేసి రెండు పక్కల బంగారం రంగులో వేయించుకుని, చిల్లుల గరిటతో నూనె లేకుండా తీసుకుని పళ్ళెం లో వేసుకోవాలి. అమ్మవారికి నివేదనకి గారెలు తయారు! నవమి పండగ నాడు మినపగారెలు తప్పనిసరిగా నివేదన చేయాలని పెద్దలు చెప్తారు. రక్కసుని హతమార్చి ఉగ్రంతో ఉన్న అమ్మ వారిని శాంతింపచేయడానికి మినప గారెల నివేదన చేస్తే అమ్మ శాంతించి, భక్తులను కరుణిస్తుంది అని పెద్దలు చెపుతారు.

## శ్రీ మహిషాసుర మర్ధినీ అష్టోత్తర శతనామావళి

దేవీ నవరాత్రులలో అత్యుగ్రరూపము మహిషాసురమర్ధినీ దేవి. ఆశ్వయుజ శుద్ధ నవమి రోజున అమ్మ మహిషాసురమర్ధినిగా అవతరించి దుష్ట శిక్షణ, శిష్ట రక్షణ చేసినది. ధర్మ విజయమునకు సంకేతముగా ఆశ్వయుజ శుద్ధ నవమి రోజును మహర్నవమిగా భక్తులు ఉత్సవము జరుపుకుంటారు. సింహ వాహనమును అధిష్ఠించి ఆయుధములను ధరించిన అమ్మ సకల దేవతల అంశలతో మహాశక్తి రూపములో ఈ రోజు దర్శనమిస్తుంది.

ఓం మహత్యై నమః
ఓం చేతనాయై నమః
ఓం మాయాయై నమః
ఓం మహాగౌర్యై నమః
ఓం మహేశ్వర్యై నమః
ఓం మహెూదరాయై నమః
ఓం మహాబుద్ధ్యై నమః
ఓం మహాకాళ్యై నమః
ఓం మహాబలాయై నమః
ఓం మహాసుధాయై నమః
ఓం మహానిద్రాయై నమః
ఓం మహాముద్రాయై నమః
ఓం మహెూదయాయై నమః
ఓం మహాలక్ష్మ్యై నమః
ఓం మహాభోగ్యాయై నమః
ఓం మహామోహాయై నమః
ఓం మహాజయాయై నమః
ఓం మహాతుష్ట్యై నమః
ఓం మహాలజ్జాయై నమః
ఓం మహాదృత్యై నమః
ఓం మహాఘోరాయై నమః
ఓం మహాదంష్ట్రాయై నమః
ఓం మహాకాంత్యై నమః
ఓం మహా స్మృత్యై నమః
ఓం మహాపద్మాయై నమః

ఓం మహామేధాయై నమః
ఓం మహాబోధాయై నమః
ఓం మహాతపసే నమః
ఓం మహాస్థానాయై నమః
ఓం మహారావాయై నమః
ఓం మహారోషాయై నమః
ఓం మహాయుధాయై నమః
ఓం మహాభందనసంహర్త్యై నమః
ఓం మహాభయవినాశిన్యై నమః
ఓం మహానేత్రాయై నమః
ఓం మహావక్త్రాయై నమః
ఓం మహావక్షసే నమః
ఓం మహాభుజాయై నమః
ఓం మహామహీరూహాయై నమః
ఓం పూర్ణాయై నమః
ఓం మహాచాయాయై నమః
ఓం మహానఘాయై నమః
ఓం మహాశాంత్యై నమః
ఓం మహాశ్వాసాయై నమః
ఓం మహాపర్వతనందిన్యై నమః
ఓం మహాబ్రహ్మమయ్యై నమః
ఓం మాత్రే / మహాసారాయై నమః
ఓం మహాసురఘ్న్యై నమః
ఓం సర్వ ఫలధాత్రే నమః
ఓం మహత్యై నమః

ఓం పార్వత్యై నమః
ఓం చర్చితాయై నమః
ఓం శివాయై నమః
ఓం మహాక్షాంత్యై నమః
ఓం మహాభ్రాంత్యై నమః
ఓం మహామంత్రాయై నమః
ఓం మహామాకృత్యై నమః
ఓం మహాకులాయై నమః
ఓం మహాలోలాయై నమః
ఓం మహామాయాయై నమః
ఓం మహాఫలాయై నమః
ఓం మహానీలాయై నమః
ఓం మహాశీలాయై నమః
ఓం మహాబలాయై నమః
ఓం మహాకలాయై నమః
ఓం మహాచిత్రాయై నమః
ఓం మహాసేతవే నమః
ఓం మహాహేతవే నమః
ఓం యశస్విన్యై నమః
ఓం మహావిద్యాయై నమః
ఓం మహాస్త్యాయై నమః
ఓం మహాగత్యై నమః
ఓం మహాసుఖిన్యై నమః
ఓం మహాదుస్వప్ననాశిన్యై నమః
ఓం మహామోక్షకప్రదాయై నమః
ఓం మహాపక్షాయై నమః
ఓం మహాయశస్విన్యై నమః
ఓం మహాభద్రాయై నమః
ఓం మహావాణ్యై నమః
ఓం మహారోగవినాశిన్యై నమః
ఓం మహాధారాయై నమః
ఓం మహాకారాయై నమః
ఓం మహామార్యై నమః
ఓం ఖేచర్యై నమః
ఓం మహాక్షేమంకర్యై నమః
ఓం మహాక్షమాయై నమః
ఓం మహైశ్వర్యప్రదాయిన్యై నమః
ఓం మహావిషఘ్న్యై నమః
ఓం విషదాయై నమః
ఓం మహాద్గవినాశిన్యై నమః
ఓం మహావ్ర్షాయై నమః
ఓం మహాతత్త్వాయై నమః
ఓం మహాకైలాసవాసిన్యై నమః
ఓం మహాసుభద్రాయై నమః
ఓం సుభగాయై నమః
ఓం మహావిద్యాయై నమః
ఓం మహాసత్యై నమః
ఓం మహాప్రత్యంగిరాయై నమః
ఓం మహానిత్యాయై నమః
ఓం మహాప్రళయకారిణ్యై నమః
ఓం మహాశక్త్యై నమః
ఓం మహామత్యై నమః
ఓం మహామంగళకారిణ్యై నమః
ఓం మహాదేవ్యై నమః
ఓం మహాలక్ష్మ్యై నమః
ఓం మహామాత్రే నమః
ఓం మహాపుత్రాయై నమః
ఓం మహాసురవిమర్ధిన్యై నమః

శ్రీ మహాకాళీ శ్రీ మహాలక్ష్మీ శ్రీ మహా సరస్వతీ స్వరూపిణీ శ్రీ దుర్గాంబికా పరదేవతాయై నమః
శ్రీ మహిషాసుర మర్థినీ అష్టోత్తర శతనామావళి పూజా సమర్పయామి

# శ్రీ రాజరాజేశ్వరీ దేవి (విజయదశమి)



## 10. విజయదశమం - విజయకేతనం! శ్రీ రాజరాజేశ్వరీ దేవి అవతారం

దేవీ నవరాత్రులలో విజయదశమి గా పిలువబడే ఆశ్వయుజ శుక్ల దశమి నాడు రకరకాల పూజలు, వేడుకలు చేసుకుని దుష్టశిక్షణ జరిపిన అమ్మను శాంతింప చేసి, ప్రసన్నమూర్తి అయిన శ్రీ రాజరాజేశ్వరీ దేవి రూపంలో పరిపరి విధాల స్తుతించి, ఇహపర సౌఖ్యాలు పొందుతారు.

అమ్మవారు చిద్రూపిణి. పరదేవతగా అలరారుతుంది. పరమేశ్వరుని అంకమును ఆసనముగా చేసుకుని, చేతిలో చెరకుగడతో, చిరుమందహాసంతో శోభాయమానమై ప్రకాశించే జగన్మాతను మనోనేత్రంతో దర్శించుకుంటూ పూజోపచారాలు భక్తితో సమర్పించుకుందాం! అనంత శక్తి స్వరూపిణి అయిన ఈ తల్లి శ్రీచక్రానికి అధిష్టాన దేవత! త్రిపుర త్రయంలో తృతీయ దేవత! ఈ రోజున శ్రీ రాజరాజేశ్వరిని ప్రసన్నం చేసుకోవడానికి కుంకుమార్చనలు, సువాసినీ పూజలు, శ్రీచక్రార్చనలు నిర్వహిస్తారు. వాహనాలకి, వ్యవసాయ పనిముట్లకి పసుపు కుంకుమ బొట్లు పెట్టి పూలమాలలు అలంకరించి పూజలు చేస్తారు. శమీవృక్షానికి పూజలు చేస్తారు. ఈ రోజే పాండవులు శమీ వ ృక్షానికి ప్రదక్షణలు చేసి, ఆయుధపూజ జరిపి, అమ్మవారి ఆశీస్సులు పొంది, కురుక్షేత్ర యుద్ధంలో విజయం సాధించారు. అందుచేత మనం కూడా విజయదశమి నాడు శమీ వృక్షానికి పూజలు, ప్రదక్షణలు చేసి ఈ క్రింది శ్లోకాన్ని పఠించుకుందాం, సర్వత్ర విజయం సాదిద్దాము.

'శమీ శమయతే పాపం, శమీ శత్రువినాసినీ! అర్జునస్య ధనుర్ధారీ, రామస్య ప్రియదర్శినీ!'

ఆశ్వయుజ శుక్ల పాడ్యమి మొదలు ఆశ్వయుజ శుక్ల నవమి వరకు జరిగిన పూజల పరంపరకు దశమి నాడు జరిపే పూజా వేడుకలు అమ్మవారి నవరాత్రి పూజకు పునః పూజ చేసి, ఉద్యాపన పలకడం అనుకోవచ్చును. బొమ్మలకొలువు పూజలకుకానీ, బాల పూజలకు కానీ, బతుకమ్మ పూజలకు కానీ ఈ రోజుతో ముగింపు పలుకుతారు.

నవరాత్రులలో తుది పూజ విజయదశమీ పూజ. అమ్మవారికి శ్రీ రాజరాజేశ్వరీ దేవి అష్టోత్తరంతో అన్ని పూజలు జరిపి సమస్త జనులు సుఖంగా వుండాలని కోరుకుంటూ, అమ్మవారికి ఎంతో ఇష్టమైన బూందీ, లడ్డూ తో పాటు షడ్రసోపేతమైన భోజన పదార్ధాలతో మహానివేదన సమర్పిద్దాము.

విజయదశమి రోజు విజయముహూర్తం అని, ఏ పని తలపెట్టినా అది విజయవంతం అవుతుందని, భక్తుల ప్రగాడ విశ్వాసం. పిల్లలు పెద్దలు కొత్తదుస్తులు ధరించి, బంధుమిత్రులతో కలిసి విందులు-వినోదాలు చేస్తారు. ప్రతీ తెలుగు లోగిలి పిల్లా పాపలతో, పెద్దల ఆదరాభిమానాలతో, కన్నె పిల్లల పట్టు పావడాలతో ముత్తైదువుల పట్టు చీరల రెపరెపలతో, కొత్త అల్లుళ్ళు, మరదళ్ల సరసాలతో, కొత్త కోడళ్ళ మురిపాలతో, ఆడపడుచుల ముచ్చటలతో, షడ్రసోపేతమైన తెలుగు భోజనాలతో పండగ సందడి నెలకొంటుంది. ఒకరికొకరు కానుకలు, మిటాయిలు ప్రేమగా పంచుకుంటారు. కలశం పెట్టి అమ్మవారి మూర్తిని పెట్టి సామూహికంగా చేసుకున్నవారు దశమి రోజున భక్తిశ్రద్ధలతో ఉద్వాసన పలికి, నిమజ్జనం చేస్తారు.

రేపటితో ఈ విజయదశమి వేడుకలు ముగించుకుంటున్న సందర్భములో అసలు ఈ పండగలు జరుపుకునే ఉద్దేశ్యం ఏమిటో, శక్తి స్వరూపిణి అయిన అమ్మవారి తత్వము ఏమిటో, వివిధ అలంకారాల పూజల వెనుక దాగిన మర్మమేమిటో అవి ఏ విధం గా మన సమాజానికి ప్రయోజనకరమో ఈ దసరా వ్యాస పరంపరలోని ముగింపు వ్యాసం లో ముచ్చటించుకుందాము.

## శ్రీ రాజరాజేశ్వరి అష్టోత్తర శతనామావళి

ఓం త్రిపురాయై నమః
ఓం షోడశ్యై నమః
ఓం మాత్రే నమః
ఓం త్ర్యక్షరాయై నమః
ఓం త్రితయాయై నమః
ఓం త్రయ్యై నమః
ఓం సుందర్యై నమః
ఓం సుముఖ్యై నమః
ఓం సేవ్యాయై నమః
ఓం సామవేదపారాయణాయై నమః
ఓం శారదాయై నమః
ఓం శబ్దనిలయాయై నమః
ఓం సాగరాయై నమః
ఓం సరిదంబరాయై నమః
ఓం సరితాంవరాయై నమః
ఓం శుద్ధాయై నమః
ఓం శుద్ధతనవే నమః
ఓం సాధ్వ్యై నమః
ఓం శివధ్యానపరాయణాయై నమః
ఓం స్వామిన్యై నమః
ఓం శంభువనితాయై నమః
ఓం శాంభవ్యై నమః
ఓం సరస్వత్యై నమః
ఓం సముద్రమథిన్యై నమః
ఓం శీఘ్రగామిన్యై నమః

ఓం శీఘ్రసిద్ధిదాయై నమః
ఓం సాధుసేవ్యాయై నమః
ఓం సాధుగమ్యాయై నమః
ఓం సాధుసంతుష్టమానసాయై నమః
ఓం ఖట్వాంగధారిణ్యై నమః
ఓం ఖర్వాయై నమః
ఓం ఖడ్గఖర్వరదారిణ్యై నమః
ఓం షడ్వర్గభావరహితాయై నమః
ఓం షడ్వర్గచారికాయై నమః
ఓం షడ్వర్గాయై నమః
ఓం షడంగాయై నమః
ఓం షోడాయై నమః
ఓం షోడశవార్షిక్యై నమః
ఓం క్రతురూపాయై నమః
ఓం క్రతుమత్యై నమః
ఓం ఋభుక్షాకతుమండితాయై నమః
ఓం కవర్గాదిపవర్గాంతాయై నమః
ఓం అంతఃస్థాయై నమః
ఓం అంతరూపిణ్యై నమః
ఓం అకారాయై నమః
ఓం ఆకారరహితాయై నమః
ఓం కాల్మృత్యుజరాపహాయై నమః
ఓం తన్వ్యై / తత్వేశ్వర్యై నమః
ఓం టారాయై నమః
ఓం త్రివర్ష్యాయై నమః

ఓం జ్ఞానరూపిణ్యై నమః
ఓం కాళ్యై నమః
ఓం కరాళ్యై నమః
ఓం కామేశ్యై నమః
ఓం చాయాయై నమః
ఓం సంజ్ఞాయై నమః
ఓం అరుంధత్యై నమః
ఓం నిర్వికల్పాయై నమః
ఓం మహావేగాయై నమః
ఓం మహోత్సాహాయై నమః
ఓం మహోదర్యై నమః
ఓం మేఘాయై నమః
ఓం బలకాయై నమః
ఓం విమలాయై నమః
ఓం విమలజ్ఞానదాయిన్యై నమః
ఓం గౌర్యై నమః
ఓం వసుంధరాయై నమః
ఓం గోప్త్యై నమః
ఓం గవాంపతినివేషితాయై నమః
ఓం భగాంగాయై నమః
ఓం భగరూపాయై నమః
ఓం భక్తిభావపరాయణాయై నమః
ఓం ఛిన్నమస్తాయై నమః
ఓం ఓం మహాధూమాయై నమః
ఓం ధూమ్రవిభూషణాయై నమః
ఓం ధర్మకర్మాదిరహితాయై నమః
ఓం ధర్మకర్మపారాయణాయై నమః
ఓం సీతాయై నమః
ఓం మాతంగిన్యై నమః

ఓం మేధాయై నమః
ఓం మధుదైత్యవినాశిన్యై నమః
ఓం భైరవ్యై నమః
ఓం భువనాయై నమః
ఓం మాత్రే నమః
ఓం అభయదాయై నమః
ఓం భవసుందర్యై నమః
ఓం భావుకాయై నమః
ఓం బగళాయై నమః
ఓం కృత్యాయై నమః
ఓం బాలాయై నమః
ఓం త్రిపురసుందర్యై నమః
ఓం రోహిణ్యై నమః
ఓం రేవత్యై నమః
ఓం రమ్యాయై నమః
ఓం రంభాయై నమః
ఓం రావణవందితాయై నమః
ఓం శతయజ్ఞమయాయై నమః
ఓం సత్వాయై నమః
ఓం శత్రుక్రతువరప్రదాయై నమః
ఓం శతచంద్రాననాయై నమః
ఓం దేవ్యై నమః
ఓం సహస్రాదిత్యసన్నిభాయై నమః
ఓం సోమసూర్యాగ్నినయనాయై నమః
ఓం వ్యాఘ్రచర్మాంబరావృతాయై నమః
ఓం అర్ధేందుధారిణ్యై నమః
ఓం మత్తాయై నమః
ఓం మదిరాయై నమః
ఓం మదిరేక్షణాయై నమః

శ్రీ మహాకాళీ శ్రీ మహాలక్ష్మీ శ్రీ మహా సరస్వతీ స్వరూపిణీ శ్రీ దుర్గాంబికా పరదేవతాయై నమః
శ్రీ రాజ రాజేశ్వరీ అష్టోత్తర శతనామావళి పూజా సమర్పయామి

# శ్రీ శాకంబరీ దేవి (ప్రత్యేకం)



# శ్రీ శాకంబరి మాత

శరత్ కాలం లో వచ్చే శరన్నవరాత్రులు లేదా దేవి నవరాత్రులలో భక్తులు అమ్మవారిని వివిధ అవతారాలలో భక్తి తో పూజించటం మనం ఈ వ్యాస పరంపర ద్వారా ప్రతిరోజు తెలుసుకుంటూ ఉన్నాము. ఈ శరత్ కాలం లో అనేకరుగ్మతలు పొంచి ఉంటాయని, అమ్మవారిని ఆ తొమ్మిది రోజులు భక్తి శ్రద్ధలతో పూజించి నట్లయితే మనకు ఆ మహాశక్తి రక్షణ లభించి ఆ తల్లి కరుణ కటాక్షాలకు కూడా పాత్రులవుతాము అని పెద్దలు చెప్తారు. కొన్ని ప్రాంతాలలో "శాకంబరి" అలంకారం లో కూడా భక్తులు అమ్మవారిని కొలుచుకుంటారు. ఈ అలంకారం యొక్క విశిష్టతను తెలియచేయటానికి ఈ ప్రత్యేక వ్యాసం ద్వారా శ్రీమతి పద్మా రఘునాద్ ముందుకు వస్తున్నారు. ఈ అలంకార ప్రాభవ విశేషాలను తెలుసుకుని అమ్మవారిని శాకంబరి మాతగా మనుసులో అర్చించు కుందాము.

నవరాత్రులలో ఒక రోజు అమ్మవారిని అనేక రకాల కాయగూరలతో, ఫలాలతో, శాస్త్ర ప్రకారం అలంకరించి శాకంబరి అవతారం గా కొలిచి దేవాలయాల్లో అర్చనలు జరుపుతుంటారు. పూర్వం దుర్గమాసురుడు అనే రాక్షసుడు తపస్సు ద్వారా బ్రహ్మని మెప్పించి, వేదాలన్నీ తనలో దాచేసుకున్నాడు. దానివలన, లోకంలో అందరు, వేదమంత్రములు, పూజలు, యజ్ఞాలు, యాగాలు, క్రతువులు అన్ని మర్చిపోయారు.

పూజలు, యజ్ఞాలు మొదలైనవి లేక పోవటంతో, దేవతలకు హవిస్సులు అందక, కోపించినందువలన, లోకంలో వర్షాలు లేక భూమి ఎండిపోయి బీటలు వారింది. పంటపొలాలు కూడా బీడు వారి భయంకరమైన కరువు కాటకాలు రావటంతో ప్రజలు చాల బాధలు పడుతూ అన్నపానాదులు లేక మాడిపోసాగారు. అపుడు ఋషులంతా హిమాలయాలకు వెళ్లి అమ్మవారిని దీనంగా ప్రార్ధించారు. వారి వెతలను తీర్చటానికి అమ్మ వారు అమితమైన కరుణతో "శతాక్షి" గా అనేకమైన కన్నులతో భూమి మీదకు వచ్చింది. బీటలు వారిన భూమిని, కరవు కాటకాలను, లోకం లో వున్న దుస్థితిని చూసి అమ్మవారి ఒక కన్నులోంచి నీరు రాగా, ఆ నీరు ఏరులై, వాగులై, నదులన్నీ నిండి లోకం అంతా ప్రవహించింది. అయితే భూములు సాగు చేసి పండించటానికి కొంచం వ్యవధి పడుతుంది కాబట్టి, మరి ప్రజల ఆకలి వెంటనే తీర్చాలి కనుక, అమ్మవారు అమితమైన దయతో శాకంబరి రూపు దాల్చి వివిధమైన కాయగూరలు పళ్ళతో సహా ఒక పెద్ద చెట్టు లాగా దర్సనమిచ్చింది. ప్రజలంతా ఆ కాయగూరలు, పళ్ళు తిని ప్రాణాలు నిలుపుకున్నారు. ఎన్ని కోసుకున్న ఇంకా తరగని సంపదతో వచ్చింది అమ్మవారు. ఆవిడ అపరిమితమైన కరుణా కటాక్షాలకు ప్రతీకయే ఈ శాకంబరి అవతారం.

## దసరాకు వీడ్కోలు!

పవిత్రమైన దేవీనవరాత్రుల సందర్భంగా మనం కొలుచుకున్న అవతార రూపాలను పరిశీలిస్తే మనకు ఒక విషయం తేటతెల్లమవుతుంది. జీవకోటికి శోక, దుఃఖ, ఆర్తులను దూరం చేసి, సుఖ, మోక్ష హర్షాలను కలుగజేసే శక్తి స్వరూపిణి భగవతి. అమ్మవారు ప్రతి ప్రాణిలోని శోభాయమాన గుణంలో వసిస్తుంది. శోభాయమానం అంటే కంటికి కనిపించే బాహ్య సౌందర్యం మాత్రమే కాదు. అంతర్లీనమైన పరిపూర్ణమైన వ్యక్తిత్వం! ఆంగ్లం లో ఒక రచయత అన్నట్లుగా 'హ్యాండ్ సం ఈజ్ దట్ హేండ్ సం డత్' శోభాయమానం అంటే సుకర్మలు చేసే నైజం! అదియే అమ్మ వారి నివాసమైన మణి ద్వీపం!

అమ్మవారి నవరాత్రములకూ వివిధ అలంకారాలు, నివేదనలు గురించి, తమ వివరణాత్మకమైన వ్యాస పరంపరలో శ్రీమతి నయన కస్తూరి, అమ్మవారి వివిధ రూప వైశిష్ట్యాన్ని మనముందు ఆవిష్కరించారు. అంతేకాక శ్రీమతి పద్మ రఘునాద్ శాకంబరి మాత గురించి, తమ ప్రత్యేక వ్యాసంతో ఈ పరంపరకు మరింత శోభ చేకూర్చారు. వారందరికి 'నమస్కరోమి' తరపున ధన్యవాదాలు!

## విజయోత్సాహాల విజయదశమి !

ఆశ్వయుజ శుక్ల పాడ్యమి నుండి దశమి వరకు వరుసగా దేవీ ఆరాధనలు, సామూహిక పూజలు, వ్రతాలూ ఆచరించడం, వాయనాలు ఇచ్చి పుచ్చుకోవడాలు, కానుకలు ఇచ్చుకోవడాలు, ఇళ్లను శుభ్రపరుచుకుని అలంకరించు కోవడాలు, బంధుమిత్రులను కలుసుకోవడాలు, బాల పూజలు, సువాసినీ పూజలు, రకరకాల వంటకాలను అమ్మవారి నివేదన కొరకు తెలుసుకుని, తయారు చేసి వంట నైపుణ్యాన్ని పెంచుకోవటం, సాంస్కృతిక కార్యక్రమాలను ఏర్పాటు చేయుట, వాటిలో పాల్గొనుట,......లాంటి కార్యక్రమాల వలన మనకు తెలియకుండానే ఎన్నో విషయాలను నేర్చుకుంటాము. మన పండగలు మనకు తెలియకుండానే ఎన్నో శిక్షణా తరగతులను నడుపుతాయి. క్రమశిక్షణను నేర్పుతాయి. దసరా కానుకలు కూడా ప్రోత్సాహకారకాలుగా వుండి, పని వారి నైపుణ్యాన్ని పెంచి, యాజమాన్యం-కార్మికుల మధ్య సత్సంబంధాలు పెంచుతాయి. పిల్లల్లో పెద్దల్లో ఆధ్యాత్మిక భావనలు పెరుగుతాయి. స్తోత్రాలు పారాయణం చేయడం వలన వాక్ శక్తి పెంపొంది, వాక్ శుద్ధి కలుగుతుంది. ఇలా శ్రీ దుర్గా దేవి పూజ మన దుర్గతులను రూపుమాపడమే కాకుండా మనలోని దుర్గుణాలను కూడా దూరం చేస్తుంది.

శరన్నవరాత్రులలో సకల సుగుణాల రాశి అయిన జగన్మాతను ఆరాధించడం ద్వారా మనవ జాతి కొంతలో కొంతవరకైనా తమలో ఆ గుణాలు పెంపొందించుకునే అవకాశం వుంది. స్త్రీ లో ఉన్న శక్తి అనంతమైనది. దానిని బహిర్గతం చేసుకుని, ఆచరణలో పెట్టడానికి ఆదిపరాశక్తి ఆరాధన

ఎంతో ప్రేరణ కలుగజేస్తుంది. నిద్రపోతున్న శక్తిని జాగృతం చేస్తుంది. విశ్వశాంతికే తోడ్పడ కలిగే శక్తి స్త్రీ జాతిలో వుంది. కనుక స్త్రీ పూజనీయం. ఎక్కడ స్త్రీ పూజింపబడుతుందో అక్కడ అంతా సస్యశ్యామలం! అంతా అష్టైశ్వరమయం! అంతా శోభాయమానం! ఇక మనం అమ్మ వారి ఒక్కొక్క అవతారం లోని విశిష్టతను చూద్దాము.

ప్రధమ అవతారమైన స్వర్ణకవచాలంకృతా దేవీ నుండి, ప్రతి మానవుడు తన కుటుంబాన్ని, సమాజాన్ని రక్షించే బాధ్యతను విస్మరించరాదు అని తెలుస్తుంది. బాలా త్రిపురసుందరీ దేవి లోని నిర్మలత్వం, అన్నపూర్ణాదేవి లోని మాతృత్వం, గాయత్రీ దేవిలోని తేజోవంతమైన బుద్ధి, శ్రీ లలితా త్రిపురసుందరీ దేవిలోని లాలిత్యం, శ్రీ మహాలక్ష్మీ దేవి లోని కళా సంపద, శ్రీ సరస్వతీ దేవిలోని విద్యాబుద్ధులు, దుర్గాదేవిలోని దుర్గుణాలను ఎదిరించి, కష్టాలను ఎదుర్కొనే ధైర్యము, మహిషాసురమర్దినీ దేవిలోని దుష్ట శిక్షణ-శిష్ట రక్షణ గావించే ధైర్యము, నిత్యమూ అన్యాయాన్ని ఎదురించి, న్యాయాన్ని సమర్ధించే సుగుణం, చివరగా శ్రీ రాజరాజేశ్వరీ దేవిలోని ప్రసన్నత ఇలా ఎన్నో గుణాల మేలికలయికే పరిపూర్ణ వ్యక్తిత్వం!

ప్రతీ స్త్రీ ఒక దేవతా మూర్తిగా ఎదిగి, తన ఇంటిని స్వర్గ సీమ చేసుకోవడానికి ఈ పండగ చాలా దోహదం చేస్తుంది. ప్రతీ పురుషుడు దానికి తన చేయి అందిస్తాడు. కనుక మనమందరమూ ప్రతి ఏడు, ఈ నవరాత్రి పండుగను భక్తి శ్రద్ధలతో జరుపుకుని, మన జీవితాలను అర్ధవంతం చేసుకుందాము.

స్వస్తి!

**'శరన్నవరాత్రములు' గురించి ఈ విధమైన అమూల్యమైన విషయాలను**
**అందించిన శ్రీమతి నయనతార కస్తూరి గారికి**
**'నమస్కరోమి' తరఫున, మన పాఠకుల తరఫున**
**ప్రత్యేక కృతజ్ఞతలు .**